# వేమన జీవిత చరిత్రము

గ్రంథకర్త
కవికోకిల చిట్టెపు వేమారెడ్డి
కొరిటెపాడు.

మొదటి కూర్పు
1500 ప్రతులు



1950

[రూపాయి

గుంటూరు-సత్తెనపల్లి తాల్లూకా రెడ్డివారి ద్రవ్యసహాయముచే
నీ గ్రంథం ప్రచురింపబడియె.

# తొలిపలుకు

శ్రీ వేమనయోగి జననకాలము-క్రీ॥శ॥ 1412 న నందన సంవత్సర కార్తీక శుద్ధ పౌర్ణమి నాటి సాయంత్రము.

నిర్యాణకాలము- క్రీ॥ శ॥ 1480 శార్వరినామ సంవత్సర చైత్రశుద్ధనవమి (68 ఏండ్లు జీవించినాడు).

మహాత్ముండగు శ్రీ వేమనయోగి జీవితంబును వ్రాయ దలంచి తదీయ చరిత్రంబున కాధారంబులుగా కొండవీటి దండకవిలయు నితరముద్రితాధారములనుండియు మరికొన్ని శాసనములనుండియు సేకరించి యనివార్యములగు నా స్వకపోల కల్పితములతో మిళితంబు జేసి యీ ప్రబంధమును పూరించితిని. దండకవిల అక్కడక్కడ గొన్ని ముద్రితగ్రంథములలో గోచరించుచున్నను అసలు తాళపత్రగ్రంథమును వ్యయప్రయాసలకోర్చి సాధించి యందలి అమూల్యవిశేషంబుల నందందు పొందుపరచితిని. కల్పన లున్నచోట కవిస్వాతంత్ర్య చమత్కృతులని పాఠకు లానందింతురుగాక. కవనమునకు రసమే జీవితమను సూత్రమును మనస్సునందిడుకొని యిట్టి యుత్తమ ప్రబంధమును పరిపూర్ణంబు గావించితిని. ఇందలి గుణాగుణంబుల రసపారీణ ధురీణులగువారలు గ్రహింతురుగాక. యీ నా కావ్యగుచ్ఛంబు భాషావధూటి కెట్టి యాభరణంబగునో రసజ్ఞులే నిర్ణయింతురుగాక.

ఉ॥ భారత దేశమందుగల
భక్తులకున్ దలమానికంబుగా
జేరువహించినట్టి మన
వేమనయోగిచరిత్ర మెల్ల శృం
గారముగాగవ్రాసితి నిది
కాదన నెవ్వరు చాలువార లె
వ్వారలకైనగాని చదు
వన్ విన ముఖ్యముగాదె భారతీ॥

ఇట్లు,
గ్రంథకర్త.

—(o)—

# ప్రథమాశ్వాసము

---

శ్రీరమణీ సంసేవిత
వారధిగంభీరభక్త • వరదాయ సదా
క్రూరాసురసంహారణ
సారబలాభీలరామ • చంద్రనృపాలా.

ఉ॥ మేలిమిగట్టునైన నుప • మింపగ జాలిన దేహకాంతితో
కాలవిచక్షణంబెఱిగి • కర్మకొలందిగ భూతకోటికిన్
వ్రాలునొసళ్ళనిల్పియని • వార్యమహోక్తులొసంగువాణి నా
తాలుకవీధియందున ఘ • నంబుగదాండవమాడుగావుతన్॥

సకలలోకస్వరూపుండగు శ్రీరామచంద్రున కంకితప్రదంబుగా నా యొనర్పంబూనిన కొండవీటి సామ్రాజ్యాభిషిక్తుండు నగు రాచవేమారెడ్డి నరపాలుని సహజన్ముండగు వేమన మహాయోగి చారిత్రంబునకుం గథాక్రమం బెట్టిదనిన వేమండయిదేండ్ల ప్రాయంబున

సీ॥ చంద్రశేఖరగురు • సాన్నిధ్యమును చేరి
భక్తితో నక్షరా • భ్యాసుడయ్యె
మరల నాయనవద్ద • గురుతర భక్తితో
నరువదినాల్గు వి • ద్యలును నేర్చి

పదునెన్మిదేదుల ♦ ప్రాయంబునందె భూ
వలయంబునం గీర్తి ♦ పసుదునగుచు
నెల్లదేశములకుఁ ♦ వల్లమాలిన మహా
కవివరుడనగ బ్రి ♦ ఖ్యాతిగాంచి

తే॥ గీ॥ తరుణ వయసున కొన్ని గ్రం ♦ థములు వ్రాసి
పండితుల డాంబికంబులు ♦ శారదోలి
సకలజనులకు బాఠమా ♦ ర్గికుడునగుచు
ఘనతకెక్కెను వేమన ♦ కవివరుండు

క॥ సురగురునితోడ నీతని
సరిబోల్పగవచ్చునంచు ♦ సత్కవు లతనిం
దరిజేరి మ్రొక్కుచుందురు
నరపుంగవయంచు వేమ ♦ నా శుభమంచున్॥

వ॥ ఇమ్మహానీయునిపేరు వేమారెడ్డి యనియు వేమనయనియు బిల్చుచుందురు. వీనియందు కొన్నాళ్ళకు-

సీ॥ యవ్వనంబునకిదే ♦ యారంభమన్నట్లు
సారగా నూగుమీ ♦ సములుదోచె
నతిదేహపుష్టికి ♦ న్నారంభమన్నట్లు
బలుపెక్కె యురము జూ ♦ పట్టుటాయె
మదవికారాళికిన్ ♦ మొదలిదే యన్నట్లు
కన్నులందున వింత ♦ చిన్నెలొదవె
జంచలంబాత్మకు ♦ న్నమకూరెనన్నట్లు
నడకలందత్యంత ♦ దుడుకులొదవె

గీ॥ దనువుతో బాటు జెక్కులు ♦ నునుపులెక్క
బలుకులందెంతొ వింత భా ♦ వంబులెసగె
దొడ్డ విద్వాంసుడగు వేమ ♦ రెడ్డి కపుడు
తరుణ ప్రాయంపువేళ ని ♦ దర్శనములు॥

వ॥ ఇట్లు వేమన, నవయవ్వన ప్రభావుండగుచు గొండవీటి కొండపయింగల యెదుళ్ళచెఱువు కుందాపునంగల బురుజుపయి నొంటిగా గూర్చుండి దిశలన్ని నిరీక్షించు సమయంబున తత్పురవాసియగు నాగమణి యను పేరుంగల వేశ్యాలలామం బా యెదుళ్ళచెఱువునం జలకంబాడబోవుతరి

క॥ తనముందుగ నేతెంచెడి
వనితారత్నమును గాంచి ♦ వహ్వారెయని వే
మన దాని చక్కదనమును
ఘనముగ వర్ణింపసాగె ♦ గడు తమకముతోన్॥

క॥ నానావిధ పండితులకు
మానని యొక మచ్చుమందు ♦ మాదిరిగా నీ
మానిని నిటుగల్పించిన
వానిని వేనోళ్ళ బొగడ ♦ వచ్చునటంచున్॥

సీ॥ నిండుపున్నమనాటి ♦ గండు జాబిల్లితో
గలసిపోనేమొ యీ ♦ కలికి మోము
నిండార విప్పిన ♦ బొండుతామలతో
గలసిపోనేమొ యీ ♦ కలికికనులు

పసుపునిగ్గులజూవు ♦ పసిడికుంభములతో
గలసిపోనేమొ యీ ♦ కాంతచనులు
హంగుగా నూగు యే ♦ నుంగు దుండంబుతో
గలసిపోనేమొ యీ ♦ గరితతొడలు

గీ॥ యందముగ దోచు దీని ♦ పిరుందు లేగి
కలసిపోనేమొ భూమి చ ♦ క్రింబుతోడ
మూనకీ ముద్దులాడితో ♦ మాటలాడి
కలసియుండనివానికిం ♦ గలదె సుఖము॥

చ॥ చిలుకల కొల్కితోనిపుడె ♦ చేరి ప్రసంగము లాడకున్న ని
శ్చలత గనంగజాలునె ని♦జంబుగనాహృదయంబుదానితో
గలకల నవ్వుచుం గదిసి ♦ కౌగిట జేర్పనిదే మదీయ వి
ద్యలకణుమాత్రము న్నెలవు♦లబ్బునెగొబ్బునదారసించెదన్

వ॥ అని బిరానం జనుచు దన యాత్మగతంబున

చ॥ పెనిమిటి లేడొయే మొగద♦ పెండిలియైనదొ కానె లేదొయీ
వనితవయస్సుజూడ గన ♦ వచ్చెడిదిం బదియారు వత్సరాల్
మనసిజబారికిందవిలి ♦ మగ్గెనొ లేదొ కులంబు కేదిదో
యని మనమందు సంశయపు ♦ యాణము జేయుచు
వేమ డాత్మలోన్॥

తే॥గీ॥ మగువ నామీదనొక్కింత ♦ మనసుసిల్పి
తిరిగి ననుజూడకిప్పు డా ♦ చెఱువుయొక్క
తీరమందున నొంటిగా ♦ గూరుచుండె
గాన, పోయెద దీని ♦ విధానమరయ॥

వ॥ అను తలంపుతో వేమం డా మానినీ రత్న సమీపంబునకుం బోయి

మ॥ తరుణీ యెవ్వరిదాన వీవిచట జిం ♦ తంజేయగానేల దు
స్తరభీతాహామృగో(గ సంకలిత సం ♦ చారంబునైయొప్పు నీ
చెరువుం జేరగ నేలవచ్చితివి నీ ♦ చింతావిధానంబు నా
కెరుగంజెప్పిన మేలునీకగుత లె♦మ్మిమ్మాటతధ్యంబనన్॥

వ॥ అను వాక్యంబులు విని గణికారత్నం బయ్యా నీవెవ్వరి వాడవనిన వేమం డామె కిట్లనియె

సీ॥ రాచవేమారెడ్డి ♦ రాజు కేననుజుండ
మగువ నాపేరు వే ♦ మనయటండ్రు
అలబృహస్పతికి జో ♦ డైన విద్వాంసుండ
ననగ బ్రఖ్యాతి గై ♦ కొనినవాడ
పారమార్థికమైన ♦ భావంబుగలవాడ
వాసిగల్గినరెడ్డి ♦ వంశజుడను
తెరవనావిధమెల్ల ♦ దెలియంగ జెప్పితి
దాచక నీదు వృ ♦ త్తాంతమెల్ల

ఆ॥వె॥ విశదపరుపుమన్న ♦ వెలనాగగొబ్బున
వానిపాదములకు ♦ వందనమిడి
పూనిచెప్పదొడగె ♦ దీనస్వరంబుతో
దాను దుఃఖపడు వి ♦ ధానమెల్ల॥

ఉ॥ సానికులంబునందు నెఱ ♦ జాణకుబుట్టితినయ్య వేమనా
దానసమస్త పాప పరి ♦ తాపభరోన్నతి కోపజాలకే
మానసమందు నెప్పుడును ♦ మాత్రము డిందని శోకవహ్నికిన్
లోనగుచుందునంచుబహు ♦ లోకులు నన్గనిదూరుచుండెడిన్॥

ఉ॥ అక్కట వేశ్యనై జనన ♦ మందుటె తప్పని రాత్రిం బవల్
బొక్కుచునున్న నన్నుగని ♦ పోరువహించెడి తల్లిదండ్రిచే
జిక్కి యనేక బాధలను ♦ జెందుచు భోగిని వృత్తి కెన్నడే
మక్కువ సేయకుండు నిది ♦ మంచిదిగాదనుచుందు రెల్లరున్॥

ఆ॥వె॥ మాయజేసి విటుల ♦ మర్మముల్ గమనించి
ధనము దోయలేని ♦ దయితమాకు
బుట్టెనంచు నన్ను ♦ దిట్టుదు రేప్రొద్దు
దయకుదప్పి తల్లి ♦ దండ్రులెపుడు

మ॥ అతిపాపంబుల కాలయంబయిన వే ♦ శ్యాకాంతనై పుట్టి దు
ర్గతికిం బోవు ప్రచారముల్ నుడిగి గంగాధారునిన్ భక్తితో
మతి జింతింపుదు నంతెకాని ధనసం ♦ బంధార్థిగాబోని నా
మతముంగాంచి కులస్థు లెల్లపుడు బా ♦ మ్మ్రయంచునన్
దూరెడిన్॥

వ॥ మరియును

సీ॥ మితిలేని మగలతో ♦ రతివహించుటకంటె
బాముకాటుకు జిక్క ♦ బడుటె మేలు
వసులవంచించు భా ♦ వములు జూపుటకంటె
వసనాభిదిని కూల ♦ బడుటె మేలు

ధనముకై యొరుల పా ♦ దంబు లొత్తుటకంటె
గడగివారాశిలో ♦ బడుట మేలు
పడుపుకూళ్ళతో నిత్య ♦ బ్రతుకజూచుటకంటె
బిడుగు కడ్డంబుగా ♦ బడుటె మేలు॥

ఆ॥ వె॥ యిట్టి చెడ్డపనుల ♦ కిల్లగు వేశ్యల
జీవనంబు నాదు ♦ భావమునకు
జింత గలుగజేయ ♦ సీదరగాని చావ
సిద్ధపడియె నిటకు ♦ జేరితినన॥

క॥ అనవిని వేమండపు డా
వనితామణీ పాపభీతి ♦ వదలింపగ ని
ట్లని చెప్పదొడగె నా విధి
వినగోరదలంచెనంత ♦ వేశ్యాంగనయున్॥

చ॥ సురపతి కొల్వునందెపుడు♦సొంపుగ బాడి నటించునట్టి యా
గరితలు నీ కులంబునని ♦ గన్గినవారలుగారె వారితో
సురపతి యెప్పుడా గణిక ♦ సూక్తుల్లతోన స్వరాజ్యభోగము
ల్నెరపడె పాపమున్నదన♦నేర్చునె వేశ్యలతో డిపొందికల్॥

ఉ॥ మేనకతోడ బూనుక స ♦ మేళమొనర్చిన గాధిపట్టి కే
నూనము సంభవించెను య♦నూరుడుమున్నుకళావతీయెడన్
మానుగ బుత్రులంగని స ♦ మానుల బిడ్డల నియ్యనుండడే
దీన దలంప వేశ్యలు సు ♦ధీనుతు లౌనని చాటిచెప్పెదన్॥

వ॥ ఇట్టిపూర్వప్రమాణంబులంగొని భవదీయకుల ప్రవర్తనంబు
వలన నెట్టి పాపభయంబుండనేర దదియట్లుండనిమ్ము

కం॥ వెలయాండ్రు గాని దెవ్వరు
కులకాంతలనంగ నెవరు ♦ కోమలి వినుమీ
పలుకులకు భావమేర్పడ
బలిసిన జగమెల్లనంకు ♦ భావమె కాదా॥

చ॥ మరునిశరంబులంటిన ర♦మాపతి యంతటివాడె తొల్లి పై
న్విరహము జెంద లేద పృథి♦వీస్థలి మానవు లెంత వారు ట
క్కరిగురుబోధముల్వినియ♦ఖండసుఖంబులొసంగునట్టి సుం
దరుల దొరంగునట్టి పర ♦ తత్వవిచారు లరుందు కోమలీ॥

మ॥ అతివా రెంతటిసాహసంబుగొని దే♦హంబీడగావచ్చి యీ
మితి లేనట్టి తనూవిలాసమును భూ ♦ మింగల్పగానొన నా
హితవు న్నొక్కటియాలకింపుమిక నీ ♦ కేపావముల్ లేక స
ద్గతినిం జెందెదవంత్యకాలమునకాం♦ తారత్నమా తప్పకన్॥

మ॥ అనియీరీతి వారకాంత దిగులా♦ద్యంతంబుగా బాపియో
వనితారత్నమ నాయెడందగల భా ♦వంబిప్పుడే చెప్పెదన్।
నను నీనాధునిగాగ జేసుకొని నా♦నాసౌఖ్యముల్ బొందుమా
యని బోధించినభోగపుం జెలియ నా♦యావానికో నిట్లనెన్॥

సీ॥ రాచ వేమారెడ్డి ♦ రాజు తమ్ముండవై
వడివంక లేని వి ♦ ద్వాంసుడవయి
పనికిమాలిన వేశ్య ♦ భామ నొనన్నిట్లు
గారవించిన నీకు ♦ గలదె కీర్తి

# ప్రథమాశ్వాసము



కల్ల దేహం బెంత ♦ కాల ముండును దీని
నింతగా మీరు భా ♦ వింపనగున
తెలివిగల్గినవారు ♦ దెలియని నాబోటి
వారికి మంచి భా ♦ వములు నేర్పి॥

ఆ॥ వె॥ జ్ఞానయోగసిద్ధి ♦ గలిగించి భవభయ
హారమునైన శౌరి ♦ దరికిజేరు
మార్గ మెరుగజెప్పి ♦ మన్నింపవలెగాని
యల్పసుఖము కిట్టు ♦ లడుగదగున॥

ఉ॥ పుట్టితివయ్య రెడ్డికుల ♦ పుణ్యుడవై ధరలోన గీర్తి చే
పట్టితివయ్య నీకు సరి ♦ పాండితు లెవ్వరు లేరటంచు జే
దట్టితివయ్య భేరిని గ ♦ తాగతము ల్దెలియంగజాలి న
న్నట్టదలంచుచుంటివిది ♦ పాప మొబుణ్యమొ నీవె చెప్పుమా

కం॥ అనవిని వేమం డపు డా
వనితామణి యడిగినట్టి ♦ ప్రశ్నంబుకు ని
ట్లని చెప్పదొడగె దానితొ
వనితా వినుమంచు దొల్లి ♦ వారి విధంబుల్॥

ఆ॥ వె॥ కామమునకు నెట్టి ♦ గట్టు లేదదిగాక
నందు వావివరుస ♦ లసలె లేవు
తారగురుని బాసి ♦ తారాధిపునితోడ
బాపమున్న రతికి ♦ బాలుపడు నె॥

వ|| మందోదరి రుక్మిణి రాధా మొదలగువారనేకులు వారి
వరునకుల గోత్రంబులనకయే సంసారంబులొనర్చి
రని పురాణేతిహాసంబులు జూపట్టుచున్నవిగదా.
యవి యిట్లుండగా మనమిర్వుర ముంబాణిగ్రహణ
పరస్పర్శాదు లెరుంగనివారముగనుక మనమింతటదాం
పత్యధర్మంబుగా సంచరించిన మనయందెట్టి పాపం
బంకురింపదనిన విని గణికారత్నం బాత్మగతంబున||

ఉ|| ఎంతటి పుణ్యమీసుగుణు ♦ డీక్రియనన్ను వరింపనాయెనా
చింతగతించెనింక దరి ♦ జేరిదునీ విరహాబ్ధినంచు బ
ల్సంతసమంది లేచి నెఱ ♦ చక్కదనంబుల బొమ్మవోలె నా
కాంతుడవైతి వంచు బిగి ♦ కౌగిట జేర్చుక వేమనోత్తమున్|

క|| అంతటవారలు భోగపు
కాంతామణి మేడకరిగి ♦ కాయజనస్త్ర
ప్రాంతోజ్వల హృదయులునై
వింతగనువ్విళ్లు గూర్తు ♦ రిదిమదమనగన్||

వ|| అంతనా భోగపుంజేడియ వేమనకున్నలుగులిడి పరిసు
భ్రితోయంబుచే మజ్జనంబొందించి కట్టుకొనబట్టు
దోవతులుత్తరీయంబు లొసంగి వెంటనే||

సీ|| పచ్చకర్పూర సాం ♦ బ్రాణిధూపము లేసె
కొల్లగామనసు రం ♦ జిల్లునట్లు
శృంగారకళ లీను ♦ బంగారుగిన్నెలం
బాలుచెక్కరనేయి ♦ పాయసంబు

లప్పడంబులు బూరె ♦ లరెసలు గారెలు
స్వరసతో వేమన ♦ వద్దనుంచి
యతడు భోంచేయుచు ♦ న్నపుడు పూవుంబోడి
పూలవీవనలచే ♦ గాలివిసరు

తే॥ గీ॥ భోజనంబైన పిదప బా ♦ న్సునకుజేర్చి
పచ్చి కస్తూరి చందన ♦ పంకిలంబు
దేహమునకంటి తాంబూల ♦ దోహదమిడి
వసత జలకంబులాడగా ♦ జని బిరాన॥

సీ॥ సంపంగి నీటిలో ♦ జలకేళి సవరించి
పసుపుచాల్వేలయు పా ♦ వడ ధరించి
యాకుపచ్చని వన్నె ♦ కోక శృంగారించి
రాచిల్క వన్నియ ♦ రవికెదొడిగి
తనువెల్ల జవ్వాది ♦ పునుగు పంకమలంది
పాల్పుగా నెలవంక ♦ బొట్టుదిద్ది
నవరత్నఖచిత వి ♦ న్నాణంబులెయొప్ప
హారముల్ మెడనిండ ♦ తీరుపరచి

గీ॥ కనుల కాటుకరేఖ పొం ♦ కముగదీర్చి
విడెము సేవించి కొప్పుపై ♦ విరులు జేర్చి
తమకమెసగంగ రాయంచ ♦ గమనయగుచు
వచ్చుదానిని గాంచి వ ♦ హ్వారెయటంచు

వ॥ వేమనతన యాత్మగతంబున

క॥ గరితగమన మరయగ ది
క్కరిగమనంబగును దీని ♦ కన్నులు జన్నుల్
సిరినిలయము లురుగిరులగు
పరమాత్ముండెంత శిల్ప ♦ పనివాడొకదా

సీ॥ పడతి నీ తోడ సం ♦ భాషింపగా లేని
బ్రహ్మకైనను మోక్ష ♦ పదవిగలదె
కలికినీతో బ్రణయ ♦ కలహమాడగ లేని
గంగాధరునకైన గలదెముక్తి
భామ నీ వాక్సుధా ♦ పానీయమంటని
కమలనాభునకైన ♦ గలదెభుక్తి
యింతినీకుచదోయి ♦ బంతులానగ లేని
యలమహేంద్రుకైన ♦ గలదెకీర్తి

గీ॥ సఖియనీతోడ సంయోగ ♦ సరసమాడ
సిద్ధపడనట్టి యతులకే ♦ సిద్ధిగలదు
సకల శృంగార శాస్త్రప్ర ♦ స్తారములకు
దగిననినుగాంచి తాపసుల్ ♦ దిగులుగొనరె

సీ॥ పడతి నీయెదమీది ♦ పసిడి గుబ్బలుజూచి
హేమాద్రియుందుండ ♦ కేగునేమొ
కలికినీపాదమైన ♦ కన్నులందముగాంచి
గండుమీల్బె దరియుం ♦ దుండవేమొ

మది రాత్రినీయొక్క • మందయానముగాంచి
దిగ్దంతులిందుండ • దెరలునేమొ
భామ నీకటి పురో • భాగంబునిలకించి
హరిపుత్రుడిందుండ • కరుగునేమొ

గీ॥ దయిత నీ ఫాలభాగసాం • దర్యమరసి
పొడుచునో లేదొనెలబాలు • డడలు జెంది
పసతినీయొక్క నడుము లే • మినినిగాంచి
గగనతలముండునో లేదొ • సొగసుదక్కి

క॥ తాగల గెల్వువంజాలిన
గోరులు మృగరాజమధ్య • గొన బౌనడకల్
మేరుగిరుల్ బిరుదులు గరి
కరముల్ పెందొడలూకనులు • కమలదళంబుల్

ఆ॥వె॥ ఇట్టి చక్కదనము • లెల్లనీయింతికి
మట్టు పరచినట్టి • మాన్యుడెవరొ
వాని పాదములకు • వందన సాహస్ర
మాచరింపవట్టి • యాత డెవడు

వ॥ ఇవ్విధంబుగా వేమన యనంగునిపుష్పశరధాటికిన్నోహ
టించు సమయంబున

గీ॥ పూనిసంప్రాప్త మగుదొర • సానివోలె
హంసతూలిక పాన్పుపై • కరుగుదెంచి
వేమనాయంచు బ్రియుని రా • వించియటకు
మరులుగొల్పిన వేమన • మగువయపుడు

క॥ ఇదెమంచి లగ్నమంచును
పదమదమై హ్రంగిపొరలు ♦ సమయంబున వే
మదనుండార్చుచు భళియని
వదలెన్ దన పుష్పబాణ ♦ పంక్తులసంతన్

గీ॥ ఈవిధంబుగ వారు రే ♦ యింబగళ్లు
మితిమెఱుంగని హాస్యపు ♦ గతులతోడ
రతియొనర్చుచు బవలిది ♦ రాత్రిరనెడి
సమయ మెఱుగరు నూత్న సం ♦ సారులగుచు

ఉ॥ చిన్నతనంబునన్ గురువు ♦ చెప్పిన వేదపురాణభావముల్
మన్నున బాతిపెట్టి యణు ♦ మాత్రముదీరిక లేక భోగినీ
చన్నులు జంకలంగనుచు ♦ సంతసమందుచునుండు గాని వే
మన్నదలంపడాయె దన ♦ యన్నమహోన్నతి నెన్న డేనియున్

వ॥ ఇట్లు వేమన వారాంగనాలోలుండునై తన గృహంబునకు
రాకుండుటలొక్కపనిహాని చేనెఱింగి కొండవీటి రాజ్యా
ధిపుండగు రాచ వేమారెడ్డి తన మనంబున

ఉ॥ చక్కని రెడ్డిరాజకుల ♦ సంతతి కొక్క కళంకమబ్బ వీ
డెక్కడికేగనో పడు పు ♦ దేకియువీనికి బ్రాప్తమాయెనా
టక్కులమారితోడ సక ♦ టాయిత డేమి వచించి దాని చే
జిక్కెనొయంచు రాజుబహు ♦ చింతనొనర్చుచునాక్షణంబునన్

గీ॥ భవ్యుడైనట్టి వామన ♦ భట్టుడనెడి.
కవిని రావించి తమ్ముని ♦ కథలు జెప్పి
నాగమణి సౌధమునకు మీఁ ♦ రేగుదెంచి
యందుగల నా సహోదరు ♦ చందమరసి

సీ॥ అన్న రాజ్యంబేలు ♦ చున్న కాలంబులో
యువరాజ వగుచు నీ ♦ వుండవలయు
దళిలి రాజ్యాంగ వి ♦ ధానంబులరయుచు
బ్రజలకునెట్టి వి ♦ బ్బంధి లేక
మంత్రులయొక్క కు ♦ మార్గంబులరయుచు
దేశ సౌభాగ్యంబు ♦ దీయకుండ
రెడ్డిరాజన్యుల ♦ దొడ్డప్రభావముల్
జిన్నమంతేనియున్ ♦ జెదరకుండ

గీ॥ గాచుకొనకున్న రాజ్య సౌ ♦ ఖ్యములు దొరగు
నంచు మీయగ్రజుండు న ♦ న్నంపెనిటకు
గాన బయలెల్లుమయ్య స ♦ త్కవివరుండ
యన్న యనదంద్రిగాడ వే ♦ మన్న యనుచు॥

క॥ వెలయాలిమాయలోఁబడి
తెలివిజెడిన దున్నవోలె ♦ ధీమసుడై మా
కులగౌరవంబులుడుపం
గలిగితివా యంచు వాని ♦ గద్దింపుమటన్॥

క॥ వినవేని నా హితోక్తులు
మననేర్పనతండు మంచి ♦ మానిసియనగన్

వినిబూనకగ్గలించిన
జననాథుండేమి నీకు ♦ జరుపునో యనుచూ॥

క॥ అని తెలిపి తిరిగిరమ్మన
జననాథుని యాజ్ఞవడసి ♦ సత్కవిజని వే
మనయున్న మేడకుంజని
జననాథుండనిన నీతి ♦ సరణిందెలుపన్॥

వ॥ వినివేమన దరహాసితవదనుండగుచు వామనభట్టునవలోకించి

చ॥ తెలియనివన్ని తప్పులని ♦ దిద్దెదు వానివిధంబుగాను ని
ష్ఫలమగు వాక్యముల్ బలుక♦బాడియె నీకు కవీంద్రియెల్ల భూ
వలయమునందు నెట్టె మగ♦వాడయిననొకయాడుదానితో
మెలగుట ధర్మమంచు విన♦మే తమ కొక్క తి లేదచెప్పుమా॥

వ॥ అదియట్లుండనిమ్ము

సీ॥ వారకాంతాలోక ♦ జారుడై వర్తించు
యాలము హొందు)నకెంత ♦ విలువతగ్గ
కోరి మేనకతో వి ♦ హారంబుజేసిన
గాధిపుత్రునకెంత ♦ ఘనత తగ్గ
మోహినీతోలుడై ♦ ముందంగవేసిన
పార్వతీసునకెంత ♦ పసువుతగ్గ
నల తిలోత్తమతో వి ♦ హారంబు సల్పిన
మనురాజుకేపాటి ♦ మహిమతగ్గ

గీ॥ వారు మనకంటె తక్కువ ♦ వారలగునె
పారజూచిన జగతిలో ♦ జారులవని

వారికెట్టుల జన్మముల్ ♦ వచ్చు జెపుమ
తెలిసి తెలియని తర్కముల్ ♦ సలుపనేల॥

క॥ నను మాన్పింపదలంచిన
దనువును బంధించుగాని ♦ తనువులోగల జీ
వుని మోహమడపజాలు నె
జననాథునకిట్టిమాట ♦ సరగున జెపుమా॥

మ॥ జగతీనాథుడు నాపయింగినిసి యే ♦ చందంబుగావించినన్
దగునే నమ్మినదానిని న్విడువ నం ♦ దాకుండు నీదేహము
ల్దగవుందప్పి చరించితేని సతిసం ♦ తాపించుచు న్నేప్పు డే
మగునో యట్టివియోగపాపఫలసం ♦ ప్రాప్తుండనేనయ్యెదన్

ఉ॥ బాస యొసంగితిన్ సుదతి ♦ భారము నాదని ప్రేమతోడ నే
చేసిన బాసకుందొరగి ♦ చేడియ నొంటిగ జెట్లపాలు గా
జేసిన నవ్వరే సకల ♦ శ్రేయములంతట బాయుగాన స
న్యాసినె భోగముల్ నుడుగ ♦ నయ్యది నామదికొప్పకుండెడిన్

మ॥ అనురాగైక సుధారసాంబుధిలో నా ♦ హ్లాదంబుగానాడ నీ
వనజాక్షిన్నమకూర్చె దేవుడని సం ♦ ప్రాప్తోరుభోగుండనై
దినముల్ వెళ్ళగజేయుచున్ జననసం ♦ దీప్తోరుపాపౌఘము
ల్జనకంజాలని క్రోవ కేనెపుడు నా ♦ సక్తుండనై యుండెదన్॥

చ॥ నరపతియావరాజ్యభర ♦ ణంబునకున్నను మానివైచి యె
వ్వరిసయినన్ సరే నిలువ ♦ వచ్చును దానికి సమ్మతింతు నీ
తరుణిలలామను న్విడువ ♦ ధర్మముగాదని భీతిమాని భూ
వరునకెరుంగజెప్పుమిదృ ♦ వంబుగ రాసభలో నెపూనికతోన్॥

క॥ తారలు ధరపై రాలిన
మేరువు దల క్రిందు నైన ♦ మేలుదొరగి యీ
ధారుణి రజమైపోయిన
వారసతిన్ విడువ నింక ♦ వామనభట్టా॥

క॥ అని తెలిపి తిరిగిపొమ్మన
విని వామన జని బిరాన ♦ వేమనసూక్తుల్
జననాథుతోడ జెప్పిన
మనమున బహుకోపమంది ♦ మంత్రులబిలిచెన్॥

చ॥ చెనటికి నీతివాక్యములు♦చెందునె తమ్మునిమేలుగోరి వా
మనకవినంపితిన్ సుకవి♦ మాట లొకింత గణింపుగోక భో
గిని నెడబాయనంచు బహు♦గేళి యొనర్చి మదీయవాక్యము
ల్మనసున లెక్కజేయడను♦మాత్రమువీనిపరాక్రమేమనన్॥

వ॥ అని రాచవేమారెడ్డి తన తమ్ముడగు వేమన దురహం
కార చెయిదంబుల కత్యంత రోషతామ్రాక్షుండగుచు,
వెంకన వీరన యనెడి దండనాయకుల రావించి

గీ॥ సద్దుజేయక వేమన ♦ సరస కరిగి
పట్టుకొని ఖైదులోపల ♦ బెట్టుడనిన
వారు సాయుధపాణులై ♦ వచ్చి వేశ్య
దాపునంగల వేమనన్ ♦ దవిలిపట్టి॥

క॥ కసికరము జూపకెంతయు
జననాథుని తమ్ముడని వి ♦ చారింపక చ
య్యన ఖైదులోన బెట్టిరి
విని యన్న యకృత్యమునకు ♦ వేమనమదిలోన్॥

ఆ॥ వె॥ రాజ్యమేలుచున్న ♦ రాచ వేమారెడ్డి
శిక్షజేసెనన్ను ♦ దక్షుడగుచు
నారు మాసములకు ♦ నాత డేమైపోనో
తన్నుదా నెఱుగని ♦ ధరణివిభుడు॥

ఉ॥ సామముదక్కి నన్ను చెర ♦ సాలలోబెట్టిన రాజరాజుపెన్
బాముచె గూలుగాగ నెస ♦ బాసిన కోమలి నన్ను జేరినా
ప్రేమలుదీర్చుగాక బృధి ♦ వీస్థలి కంతట సర్వ భద్రముల్
స్వామియొసంగుగాక నిది ♦ సత్యము నిత్యముగానుపించెడిన్॥

వ॥ వెంటనే వేశ్యాంగనం గొంపోయి పడమర నల్లమలమధ్యం
గల మహానందిపర్వతప్రాంతంబున విడిచిరండనిన పృథివీపతి
యాజ్ఞానుచందంబున దండనాయకు లా గణికారత్నంబు
నట్ల గావించివచ్చిన, నయ్యింతి మహానందీశుని సమీపించి

చ॥ సరభసవృత్తితోడ నృప ♦ సైనికు లీడ్చుకవచ్చి నన్ను భీ
కరవనసీమలందిడిసి ♦ కన్పడ కేగిరియాతుదాన నీ
గురుతర వ్యాఘ్రసింహములు ♦ కోరిచరించెడిచోటులందు నీ
శ్వరభవదీయపాదజల ♦ జంబులెదిక్కని మ్రొక్కి యాపయిన్

ఉ॥ సూనశరాళికిన్మ్రగుల ♦ జొక్కుచు దాలిమిదక్కి యింతి యా
కాననసీమలందు పరి ♦ కల్పిత పుష్పపరాగధూళిచే
మేను వికాసమంద నని ♦ మేషపరిస్థితి బూనిదృష్టులం
జానుగ వేమనాయని వి ♦ చారపదున్ మదినిల్వకెచ్చుటన్

ఉ॥ అక్కట నన్ను ఘోరవిపి ♦ నాంతరసీమలకంపి నా ప్రియు
న్నెక్కడొ దాచినట్టి ధగ ♦ ణీపతికెంతటి పుణ్యమబ్బు నే

నెక్కడి కేగుదాననిక ♦ నియ్యెడ నన్నని బ్రోవజాలు వా
డొక్కరుడైన గానుపడ♦డుగ్రవనాంతరమందు జూడగన్ ||

మ॥ ధరణీనాథున కెగ్గు జేయవలుపన్ ♦ దర్పోన్నతింజెంది యే
నరులం దగ్గముగా జరించి బహునా♦నంబెన్నడుంగాంచ ని
ష్కరుణాలోకుడనై నృపాలు డిటులీ♦ కాంతారమధ్యంబునం
దరయన్నన్నిటు లొంటిగావిడువన♦ న్యాయంబుగా దేశివా॥

ఉ॥ ఇట్టి యకార్యమున్సలుప ♦ నెవ్వరుబూనుదురాడుదోడునం
బుట్టినవా రెవండు దల ♦ పోయును నింతటి సాహసంబు కే
నెట్టుల బోవ నేర్తు బ్రియు ♦ నేక్రియగాంతునటంచు వేశ్య న
ల్లట్టులజూచుచున్ మృగవి♦తానములంగనిదాగలాడుచున్॥

ఉ॥ కోరిమునీంద్రులీవన ని ♦ కుంజములం దపమాచరింపుచున్
వారు విహారముల్సలుప ♦ వత్తురటందురు నందికొండ కె
వ్వారలు రార దేమిటొ ♦ ధృవంబుగ నాతొలిపాపమేమొ న
న్నేరిల గాతురింక మది ♦ కెయ్యదియుం దరిదోచదీశ్వరా॥

క॥ ఎక్కడనుండెనో నా ప్రియు
డిక్కడి కేలాగువచ్చు ♦ నేమాయని నల్
దిక్కులు జూచి నిరాసల
బొక్కుచు నా నందికొండ ♦ బోటున కేగెన్॥

వ॥ అంత నా వేశ్యారత్నం బా నందికొండ నెత్తంబునం
దొంటిగాగూర్చుండి తనయాత్మగతంబున

శా॥ ఈ దుష్టోరగ క్రూరజంతువులలో ♦ నీయుగ్రశార్దూలిలో
నేదారిం జనరాదు నిల్చుటకు నెం♦తే గుండియల్ వ్రీలెడిం

బాదంబెచ్చట నిల్పరాని నెలవుల్ ♦ బ్రహ్మాండతుల్యంబునౌ
నాదారాభాగ్యమడంపజేకురినపు ♦ న్యాపమ్మందు లేడొక్కడున్

గీ॥ అక్కటా నాతో మారమా ♦ టాడునట్టి
పుణ్యులెవ్వరు లేరయి ♦ ప్పుణ్యగహన
కొండబిలములయందు కూ ♦ ర్చుండి భూరి
జపములన్ జేయు గురుగుణ ♦ తపసులైన॥

క॥ అను దీనాలాపంబులు
విని మునియొక డెవ్వరిచట ♦ నేడ్చెదరని యా
వనకొండకొమ్మకుంజని
వనితామణివద్ద కేగి ♦ వారని దయతోన్॥

మ॥ చెలియా యెవ్వరిదానవిచ్చటికి నేం ♦ చేయంగతం బేమి నీ
కులమే దెవ్వరు తల్లిదండ్రులకటా ♦ గోడీక్రియం జేయగా
గల కష్టంబుల కేదికారణమొ వ ♦ క్కాణింపుమా నాతో నీ
నెలవుం జేర్చెద భీతిమానెదను తె ♦ ల్చి చెప్పుమా దాపకన్॥

క॥ అని మునిపతి యడిగిన నా
వనితామణి లేచి మునికి ♦ వందనమిడి చ
య్యన దెలుప దన చరిత్రము
మునివరు డాశ్చర్యపడుచు ♦ మోసంబనుచున్॥

మ॥ ధరలో నెవ్వరికైననున్న దెకదా ♦ దాంపత్యధర్మంబు యో
తెరవా నీయెడ నే జనించినటు థా ♦ త్రీనాథు డత్యుగ్రుడై
నరసంచారము లేక వన్యమృగ నా ♦ నా సంకులంబైన భీ
కర కాంతారపదంబునన్విడువ లో ♦ కంబెల్లదూషించెడిన్॥

క॥ పరితాపమంద నేటికి
గరితా నా యాశ్రమంబు ♦ గలదిచ్చట నో
హరిణాక్షి రమ్ము పోదము
గురువులదరినుండ నెట్టి ♦ కొరతలు గలవా॥

గీ॥ అనిన మునిపతి వెంట న ♦ వ్వనజగంధి
యరిగిన౯యమిపాదపం ♦ స్మరణజేసి
యింగితముతోడ వేదవే ♦ దాంగ భావ
ముల నెఱుంగుచు నెంతో సొం♦ పలరుచుండె॥

క॥ వనజాక్ష భక్తవత్సల
ఘన కార్ముకహస్త దివ్య ♦ కౌస్తుభవక్షా
మనసిజహరసన్మానిత
సనకసమునిలోల రామ ♦ చంద్రిదనృపాలా॥

గద్య॥
ఇది శ్రీ జానకీరామచంద్ర చరణారవిందవందనకందళితాయ
మాన మానసుండును సకల విద్వజ్జనవిధేయుండునగు
శ్రీ చిట్టిపు బుచ్చిరెడ్డిగారి ద్వితీయ పుత్రుండును,
సహజపాండిత్య వేమారెడ్డినామధేయ
ప్రణీతంబైన వేమనజీవిత చరిత్రంబు
నందు ప్రథమాశ్వాసము.



# ద్వితీయాశ్వాసము

శ్రీరమణీ సంసేవిత
వారధిగంభీర భక్త • వరదాయ సదా
క్రూరాసుర సంహారణ
సారబలాభీల రామ • చంద్ర నృపాలా!

వేమన కారాగృహాని బద్ధుండై తనప్రియురాలి వనవాసం బొక్క వేగరునిచే నెఱింగి॥

సీ॥ ఘడియకాలంబునే • గాల్పింపకున్నచో
మదినిల్పలేక నా • కెదురువచ్చు
మంకుగా నొకపూట • మాట్లాడకున్నచో
జాలిగానను బ్రతి • మాలజూచు
రమణితో నొకనాడు • రతికొగ్గకున్నచో
కారణంబేమని • కలయజూచు
బొరుగువారిండ్లకే • బోయికూర్చున్నచో
సొంపుగానాతోడ • రక్కింపజూచు

గీ॥ నానితంబిని యిప్పుడే • యడవులందు
మొట్టలుండెనో నేను జూ • పట్టునికి
బ్రతికియుండెనో లేదో నన్ • బాయుకతన
నక్కటా యెంత దుర్దశ • లందె వేశ్య॥

గీ॥ పలికి బొంకు టెఱుంగని ♦ భాగ్యవతియు
నన్యులకు జిత్తమియ్యని ♦ యట్టి సుగుణ
వారకాంతాలలామ సు ♦ వ్రత సుశీల
నాగమణి నెట్లు మరతు సం ♦ భోగమిడతు

చ॥ అలికుల వేణితో సరస ♦ మాడక నెన్నిదినంబులయ్యెనో
చిలుకలకొల్కితో మనసు ♦ సేయక మాసము లెన్నిచెల్లెనో
తలకొని దాని వాతెర సు ♦ ధారసపానము జేయకున్కి నిం
జలిగొని నాయెడంద పలు ♦ సారులు నానిలలామ నెన్నెడిన్

క॥ అంతట నారవమాసము
కొంతవరకు జరుగుటయును ♦ కొండవీటి భూ
కాంతునకు రాజ్యపాలన
ప్రాంతంబై తోచుచుండె ♦ బలు చందమునన్॥

క॥ ఆ రెడ్డిరాజు లెప్పుడు
గారవమున గొల్చుచుండ్రు ♦ గౌరీదేవిన్
వారడుగునట్టి వరములు
మారాడక కొసంగుచుండు ♦ మాంకాలెప్పుడున్॥

వ॥ రెడ్డిరాట్చంద్రుల కధిదేవతయగు గౌరీపూజ నిమిత్తంబై
కార్తిక శుద్ధత్రయోదశి నేకువజామున కృతస్నానుండై
రాచవేమారెడ్డి నరపాలుండొంటరిగా గన్ధార్ఘధూపదీప
నైవేద్యాదులంగొని గౌరీనిలయంబుంజొచ్చి కుసుమాక్షత
మంత్రపూర్వకంబుగా నద్దేవి నారాధించి ధూపదీప నైవే

ద్యాదులన్నిడి ప్రదక్షిణపూర్వకంబుగా నమస్కారంబాచ
రింపుతరి

క॥ తన తమ్ముని శాపముచే
ఘనభుజగంబొకటి యచట ♦ గ్రక్కున రాజున్
గని కాటునందె నంతట
జన విభుడా దేవి పాద ♦ సన్నిధిబడినన్।

మ॥ కనియా దేవత రాజుతో నసియె నీ। కర్మకంబె సిన్నీవిధిం
బెనుభామై జెడమెట్టు శాపముతగన్। వేరేమి లేదింగులో
నను దూషించిన లాభమేమిగల ద♦న్యాయంబుగా ధాత్రినిం
జనదూష్యంబుగ రాజ్యమేలితివి ప♦శ్చత్తాపమిం కేటికిన్॥

వ॥ అనునెడ నచ్చో నిలువంబడిన

ఉ॥ ఆలయమెల్ల నూడ్చి యెపు♦డాకులుబువ్వులు దెచ్చి దేవతా
పాలిట నుంచి రేబవలు ♦ భాయనికాపలిగాచునట్లు భూ
పాలకుడుంచినట్టి యొక ♦ భామపుళిందజగాంచి వేగ భూ
పాలున కేలనిట్టి పెను♦భామునుగూర్చెనో దేవియంచు తాన్॥

గీ॥ రాజు మృతినందె నో కవి ♦ రాజులార
మంత్రివరులార దేవత ♦ మందిరమున
భూరిభుజగంబుచే దేవి ♦ పూజసేయు
సమయమునందు కేకలు ♦ సలుపుచుండ॥

వ॥ శబరాంగన కేకారవంబు లా పురవాసులకు వినరామిం
జేసి యెవ్వరు రాకుండిసం జూచి

చ॥ పరుగునబోయి కొండపుర♦వాసులతో మొరబెట్టసాగె భూ
వరుడు గతించె నొక్కపెను♦బాముచె దేవతమందిరంబులో
గురుకవులార మంత్రియుత ♦ కోవిదులార బిరానరండు యా
తెరగును మాన్పజాలిన సు♦ధీవరునొక్కరు వెంటదీసుకన్॥

క॥ అనుశబరాంగనపల్కులు
విని మంత్రులగూర్చుకొని క ♦ వీశ్వరులవుడా
జననాథువద్దకుం జని
కను లవయవములనుజూచి ♦ గాబర పడుచున్॥

వ॥ వారియందుంగల విషహరప్రయోగుండగు మాంత్రికుం
డారాజు ముఖధాతులక్షణపరీక్షయుంగావించి॥

చ॥ జనపతి మేనియందున ని♦జంబుగ బ్రాణము లేవిలేవు యీ
తని సహజన్ముని న్నిటకు ♦ దక్షుణమే పిలిపింపుడన్న వా
మన కవిపుంగవుండపుడు ♦ మంత్రికుమారునిబంపెనీవు వే
మనకడకేగి తెల్పుము క్ర♦మంబుగ నాహితవాక్యముల్దగన్॥

శా॥ గౌరీపూజ నిమిత్తమై యరిగి శృం ♦ గారంబుగా దేవత
న్నారాధించి నమస్కరింపుతరి న♦న్యాయంబుగా నిప్పుడే
మారాజన్యుడు గూలిపోయె నొక స♦ర్పస్ఫూర్తికింజిక్కి వి
స్తారోదారమనంబుతో నరిగి నీ ♦ దక్షత్వముంజూపుమా

వ॥ అనవిని మంత్రికుమారుం డా కారాగృహంబు దరియం
జొచ్చి వేమన నవలోకించి

గీ॥ పరగమీాయన్న యిపుడొక ♦ పాముపలన
గరువబడి ప్రాణముల్ వీడె ♦ గౌరిదేవి
యాలయంబునబడిన భూ ♦ పాలునరయ
జాగుసేయకరమ్ము సం ♦ శయము గొనక॥

గీ॥ అంచు మంత్రికుమారు డా ♦ యత్తుడగుచు
ఖైదులో నున్న వేమన ♦ కడకుబోయి
మ్రొక్కి తన యగ్రజుని యొక్క ♦ మూలమెల్ల
దెలిపి తలుపుల తాళముల్ ♦ దీసెనంత॥

గీ॥ అన్న మరణించెనను వాక్య ♦ మిన్నయపుడె
సర్వజనముల కష్టముల్ ♦ సమసెనంచు
బయలుదేరెను వేమ భూ ♦ పాలునరయ
మంత్రిపుత్రునిగూడి వే ♦ మన బిరాన॥

ఉ॥ వచ్చిబిరానయగ్రజుని ♦ వంకగనుంగొనిబాష్పతోయముల్
హెచ్చుగగార్చుచున్మనసు♦కెయ్యది దోచక నూరకున్నవా
న్మెచ్చికతోడవేమనతొ♦మంత్రులుగూడిప్రసంగమాడియా
చచ్చినవానికిన్ దహన♦చందము లేర్పడజేయుమాయనన్॥

వ॥ అంత వేమన చింతాసాగరనిమగ్నుండగుచు

గీ॥ రాచ వేమనృపాలుని ♦ రాణి కిట్టి
వార్తదెలియంగబంప న ♦ వ్వనితవచ్చి
పతి పదాబ్జములందున ♦ బడి బిరాన
పడతి యేడ్వంగసాగె నీ ♦ పగిదిగాను॥

సీ॥ పతిలేని జన్మ దు ♦ ర్గతి కేగునందురు
యదిగాక సుతులు లే ♦ రాయెనాకు
మరది వేమనరాజ్య ♦ భరముదాల్పండాయె
రాజ్యమేలంగ నే ♦ రాజులేడు
మావారిలోన సా ♦ మ్రాజ్యమందినవారు
కడగి యేనాడొ స్వ ♦ ర్గస్థులైరి
వసుధలో శ్రేష్ఠ భూ ♦ వరుల కీనాటితో
దీరినదేమొ భూ ♦ భారపహాత॥

గీ॥ కాలసర్పంబు నాభ ర్త ♦ నేలగఱచె
నంచు దుఃఖింపుచున్న యా ♦ యతివయొక్క-
వంతదీర్పంగ వేమన ♦ వదినితోడ
నెల్లవారలు వినగ దా ♦ నిట్టులనియె॥

చ॥ తెలియకజాలిజెంది బహు ♦ తీవ్రగతిన్వలపోయనేల భూ
వలయమునంజనించుప్రతి ♦ వారలుబుట్టుటచచ్చుచుండు ట
ల్బలు మరుజూచుచున్నగ వ ♦ బాడియెచావనివారిభంగి దె
క్కలితనమేల గాగలుగు ♦ కార్యములాగును యెంతవారికిన్

మ॥ ధరణీచక్రము నేకచక్రముగ స ♦ ద్ధార్మిక తాత్పర్యులై
పరిపాలింపరె భూపతుల్ దొలుత సం ♦ పద్గర్వితామోఘులై
మరలంబోవరెయంతులేక దమ సా ♦ మ్రాజ్యంబులం బాసియె
వ్వరికైనందొలి తావుకుంజనక న ♦ వ్వా యేటికిందప్పునే॥

గీ॥ వినుము సూరేంద్రవరకు జీ ♦ వింపగలరు
మానవులకాయువంత స ♦ మాప్తియగును

మధ్యకొందరు వారి క ♦ ర్మానురీతి
బొలియుచుందురు దీనికిం ♦ బొగులనేల

ఆ॥ వె॥ గంపెడంతకన్ను ♦ గల్గిన దేవుని
టక్కు దెలియ లేని ♦ కుక్కవలె
దేహినిత్యమనెడి ♦ మోహవారాశిలో
మునిగి తేలుచుంద్రు ♦ మనుజులెపుడు

క॥ మున్నేలిన భూపాలకు
లున్నారా మనుసుదీర ♦ నుర్వీపతులై
యున్ననగలయగ లేదా
కొన్నాళ్లేయుందు రిట్టి ♦ కోవిదులైనన్॥

వ॥ మరియునో యవ్వా పెరిగినవస్తువిరుగుటయు రుచించినది
యరుచియగుట ప్రతిబింబించినది యదృశ్యంబగుటనైజ
గుణంబులుగాని భిన్నాభిప్రాయంబులుగావుగదా యట్లైజన
సంబంధిన మానవకోటులలో యజ్ఞదానవిద్యాతపోలబ్ధులగు
వార లవసానకాలంబున సమవర్తిదూతల బారింబడక సనం
తంబగు విష్ణులోకసాన్నిధ్యులరై పునర్జన్మభయంబుడక్కి
నిరాతంక సుఖోల్లాసులరై యుండురది యట్లుండగా నిరంతర
పాపహేతుకంబైన చోరతస్కరడాంబిక మాత్సర్యాది
గుణంబులచే నహర్నిశం బాశాపాశ నిబద్ధాత్ములరై
వర్తించు యవిద్యాపారీణులగు మానవు లంతంబులేని
శిక్షంబులకుం గురియగుచు నిరంతర చింతాసాగరంబు
నందుయ్యాలలూగుచు నవసానకాలంబున యమదూతల

తర్జన భర్జనాదుల కోహాటింపుచు వారివారికర్మానురీతిగా మహారౌరవాదులంబడి స్రుక్కుచు నెడతెగని జననమరణావ్యవస్థలం బొందుచుందురు. మరియు నో మాతామహురాలా! యౌవనరూపద్రవ్యజీవితంబు లత్యంత సంచలంబులని యెఱింగిన పాండిత్యు లిట్టి మిథ్యాలోకంబునుం గూర్చి వగవంబోరు సుమా, కాలం బౌన్నత్యాంబై కాలసర్పంబుచే గూలిన భర్తకై విలపించుట వృధా ప్రియత్వంబుసుమా, యిట్టి యోగవియోగంబు లేమాత్రంబును విద్వాంసుల గలతంబెట్టజాలవనిన విని రాచవేముని పట్టమహిషిదుఃఖోపశమనయై మరది సుభాషితంబుల కానంద సంహాయియై వియోగావస్థకుం గురిగాని తనంబుతో నున్నంత వేమన

సీ॥ వందిమాగదమంత్రి ♦ సందోహములతోడ
వివిధవాద్యములపెన్ ♦ రవముతోడ
మండలేశ్వరులు సా ♦ మంతరాజులతోడ
దండనాయకుల పె ♦ త్తనముతోడ
సాగిబాంధవమిత్ర ♦ సైన్యావళులతోడ
పౌరజనాళి రా ♦ వములతోడ
నగరుచందనధూప ♦ మొగడుతావులతోడ
బావనస్థలికి భూ ♦ పాలుజేర్చి
గీ॥ దేవదారువు చందన ♦ దివ్యకాష్ఠ
సమితినింగూర్చి వేమన ♦ సార్వభౌము

దేహమర్ద్దాని యందు సం ♦ దీప్తపరచి
పరిమళద్రవ్యములను సొం ♦ పారజిలికి

ఉ॥ అంతట వేమడేగితన ♦ యన్నపదంబులమీదవ్రాలియ
త్యంతవిషాద దుఃఖజని ♦ తాశ్రుకణంబులురాలనేడ్చిలో
కాంతకుడైన యగ్రజుని ♦ కంతటనగ్నినొసంగి వేగభూ
కాంతునకెల్ల కర్మకథ ♦ కాండముసాంగముగానొనర్చితాన్

వ॥ ఒకానొక పరదేశికునిచేదన్ను ప్రేమించిన గణికారత్నంబు మహానంది పర్వత ప్రాంతంబు నందొక్కముని యాశ్రమంబునంగలదని యెఱింగి హయారూఢుండై దినత్రయంబున కచ్చోటికిం జేరి ప్రియవతింగూడుక మునిచేనను జ్ఞాతుండై కొండవీటిరాజ ధానింజేరి యెప్పటివలె వేశ్యాలయంబుం జేరుక సుఖంబుగానున్నంత గొండవీటికధినాథుండు లేమిం జేసి

సీ॥ దొంగలు నిర్భీతి ♦ దోపిళ్లుసాగించి
రంతకంతకు జారు ♦ లధికమైరి
పతిమాట కెదురించు ♦ పడతులగ్గలమైరి
కలయగావర్ణ సం ♦ కరముదోచె
ధర్మశాస్త్రరవి ♦ ధానంబులడుగంటె
సరవితో వర్షముల్ ♦ గురువాయె
నెల్లగ్రామములయం ♦ దల్లరిమితిమీరె
బ్రజలకు నిద్రలుం ♦ బట్టవాయె

గీ॥ మంత్రులకు రాజ్యమందు స్వ ♦ తంత్రముడిగె
గవుల సంబోధనంబులు ♦ గడచిపోయె

గుండెలరచేత బట్టుక ♦ నుండిరెల్ల
జనులు వేమనృపాలుండు ♦ జనిన పిదప

క॥ దేశమరాజక మై కడు
మోసంబులు జారచోర ♦ ముఖమైజనుల
గ్లానలుజెసి ప్రాణముకై
దోసిలిడుచు దేవునకు బు ♦ ధోత్తములుండెన్

వ॥ అట్టి సమయంబున దండనాయక మంత్రి కవిజనంబు లొక్కుమ్మడి వేశ్యగృహంబుంజొచ్చి వేమన నవలోకించి

గీ॥ వాసిగల్గినరెడ్డి స ♦ ద్వంశమందు
బుట్టినాడవు సాటిలే ♦ నట్టిసుగుణ
వంతుడవు యంతులేని వి ♦ ద్వాంసుడవయి
భోగినీవశ్యమేల నీ ♦ బోటికవికి

మ॥ అతిచాంచల్య మనోరథుల్చనెడి ♦ ప్రాయశ్చిత్తమార్గంబుల
న్మతిమంతుల్జన నేర్తురే సుగుణసం ♦ భందాగ్రగణ్యుండవై
మతిలేకుండ విటాంగనన్గదిసి సా ♦ మాన్యాకృతిన్ మీరుగు
ర్గతికింబోవగ జెల్లునేసుకవి లో ♦ కగ్రామణీ వేమనా

వ॥ వెండియు గవితావతంసుండగు సూరనార్యుండా వేమన కిట్లనియె

చ॥ నిలకడలేనివారుబహు ♦ నీచతలంపులు జేయువారు,న
గ్గలపుధనార్థులై పరువు ♦ గాననివారు సహర్నిశంబు వి
చ్చలవిడిగా జరింపగల ♦ జాలినవారలు పాపపుణ్యము
ల్దెలియనివారుసానులు సు ♦ ధీవరవీరలతో జరింపుచున్

గీ॥ దుష్పథంబుల కిరవునై ♦ తోచునట్టి
బుద్ధి చండాలు రావేశ్య ♦ భోగమునకు
నాసజెందెడువారు స ♦ న్యాసులగుచు
దిరుగువారల జూడమే ♦ దేశమందు

మ॥ అవినీతుల్వలపుల్సమానమనుయా♦త్మానందముం జేయుచుం
గువిధోపాయము జేయునట్టిగణికల్ ♦ గోవేషవ్యాఘ్రంబులై
యవ లీలంధనవంతులంగదిసి య ♦ న్యాయంబుగావారి దా
జవముఁన్ సంపదలన్గణించెదరు దు ♦ శ్చారిత్రలైభోగినుల్

సీ॥ మితిలేనిరోగసం ♦ తతులకావాలంబు
ఘనయుశోహాని దు ♦ ర్గతులతోవ
సర్వ ద్రోహముల ప్ర ♦ స్తారంబులకు దావు
నిలకడలేని బు ♦ ద్ధులకునిరవు
బహు దురాచార సం ♦ బంధయోషది సేవ
కల్లమోసాది సం ♦ ఘములకిరవు
సత్యధర్మార్థ ప్ర ♦ చారంబులకు వైరి
ధనికులగూల్చు భూ ♦ తములకొంప

గీ॥ నీతిసీమంబులెఱుగని ♦ రోతకుంప
సకల పాపాలజాలునీ ♦ సానినెలవు
కాన మీవంటిదొరలకీ ♦ సానివారి
పొందుమరగిన గీర్తి సొం ♦ పొందగలదె

గీ॥ వినుము వేమననాదు వి ♦ వేకమరసి
వాసికెక్కిన రెడ్డి రా ♦ డ్వంశమందు

ఘనతగాంచినభూరి స ♦ త్కవివరుండ
వమలబుద్ధివినీకు జె ♦ ప్పంగనెవరు

క॥ వెలనాగ సంగమంబును
వలదనివిడనాడి పట్ట ♦ భద్రుడవై మా
యలజడినిబాపు మాయను
పలుకులువిని వేమడంత ♦ బలికెంగలకన్

శా॥ సత్యాన్వేషుల ధర్మమార్గనిరతుల్ ♦ సత్కార్యదీక్షాపరుల్
నిత్యానిత్యములైన రాజ్యములకై ♦ నీసూక్తులాలింతురే
పత్యేకాద్భుతయత్నములనలిపిసం ♦ ప్రాప్తంబుతోదృప్తులై
నిత్యానిత్యములైన ప్రాణములకై ♦ నీవోలెబోధింతురే

ఉ॥ కాలికి మువ్వలందియలు ♦ గట్టుక నోటికివచ్చినట్లుగా
సాలునుమూలలేనికవి ♦ సత్తములన్ బిరుదుల్గణించినా
మోలవంచించినట్టి పెను ♦ మూఢహితోక్తులనాలకింపగా
బాలకుడైనబూనునె ధృ ♦ వంబుగ వామనసూరనోక్తులన్

ఉ॥ పుట్టినదెప్పుడో మరలి ♦ పోవునదెప్పుడో నీజగత్తు దా
గుట్టునెఱుంగజెప్పగల ♦ కోవిదుడొక్కడుగానుపింపడీ
వట్టిప్రసంగముల్ సలుపు ♦ వారి కుయుక్తులకేమిగాని నే
బట్టినదానినిన్విడువ ♦ బాపమొపుణ్యమొ జెప్పుడీ త్వరిన్

శా॥ ఏదేరీతిగ గల్గునో మరలనే ♦ దేరీతిగాదీరునో
యీదందహ్య విచారముండగపు వా ♦ డీధాత్రిలోనున్ననే
వాదంబాడగనున్న వాడనువెసం ♦ వాదింపగాలెండి మీ
గాథల్ పుక్కిటిధర్మసూక్తులనునా ♦ కామీరుబోధించుటల్

క॥ వెలయాడుశ్రీగాని దెవ్వరు
కులకాంతలనంగ నెవరొ ♦ కోవిదులిప్పుడీ
పలుకులకు భావమేర్పడ
బలుకుడి సత్కవులబుద్ధి ♦ బలముంగందున్

క॥ కులభేదంబులు గలవని
పలికెద రీకులము లాది ♦ బ్రహ్మచెనయినం
దొలి వేల్పు డేకులస్థుడు
కులవరుసలెయున్న నజుడు ♦ గూడు నెవాణిన్

చ॥ జలజదళాక్షులన్వీడువ ♦ జాలినయట్టి మహీషునొక్కరుం
బలుకుడు చూతమింకబలు ♦ భంగుల జేయక విప్రలంబము
ల్దెలియునివన్ని తప్పులని ♦ దిద్దెడువారి విధంబుగాను మీ
పలుకుల కందమేది నెఱ ♦ వాదములాడెడి భేదబుద్ధికిన్

ఆ॥ వె॥ పొద్దు బోకవెర్రి ♦ పోకిళ్లు బోనేల
బుద్ధి కెడమునైన ♦ శుద్ధులాడి
యద్దుదెలసి తిరుగు ♦ యాతడెమనుజుండు
గానసుకవులార ♦ పూనివినుడి

ఉ॥ చెప్పినదానినిందివిరి ♦ చేసెడివాడొకడైన లేమలే
చెప్పెడి దొక్కరీతితము ♦ చేసెడిదొక్క తెఱంగుగానయా
ముప్పెలమార్గముల్ వినిన ♦ మోసమెతప్పకసంభవించు నే
చెప్పినదానికింబదులు ♦ చెప్పగజాలిన వారు లేరిలన్

చ॥ వినుడి కవీంద్రులార తను ♦ వెర్రి తలంపులకేమిగాని చ
క్కని యువతీమణింగదిసి ♦ కౌగిటజేర్చి సుఖంబులందుయా

మనుజునకేలరాజ్యము హి ♦ మాచలసేతవుదాకనిచ్చి నం
గొనునెవ్వృథాపప్రియాసమున ♦ కుంబకుగెత్తునెయెవ్వడేనియున్

చ॥ మరునిశరాళికోర్వగల ♦ మానవులెవ్వరు లేరు దేవతా
వరులుదపింపలేద వన ♦ వాసులు గోచులుమల్వలేద భూ
భరణసమర్థులెందరో ప్ర ♦ మాదముగాబలిగారె తొల్లియె
వ్వరికయినన్నరే తొలుత ♦ వచ్చిన దంత్యముగాక దప్పునే

ఉ॥ కన్నులుమూడు గల్గిబహు ♦ కాలతపంబొనరించికొండయం
దున్న మహేశ్వరుండె పెడ ♦ త్రోవనిత్రోయుకై నెట్లుగంగినిం
దిన్నగనెత్తి పైనిడుక ♦ దేవ సభాస్థలికేగినాడు యం
దున్నమునీశ్వరుల్ విబుధు ♦ లొక్కటదప్పనకెట్లుమొక్కెడిన్॥

ఉ॥ చక్కనిదానినింగని వి ♦ చారమనస్కులు నాచువేగ బె
న్మక్కువలేనివారు పది ♦ మందికి నూటికినొక్కడుండునా
టక్కరి నీతివాక్యముల ♦ డాంబికులై చరియింతుగ్రాని చీ
కుక్కలకంటె నీచమగు ♦ కోర్కులుజేయుదురాత్మలోపలన్

చ॥ గరుడతురంగుడైన గిరి ♦ కార్ముకుడైన విరించియైన ది
మ్మరపడకుందురే తగిన ♦ మానినిదృష్టి శరంబులంటినన్
నరులననెంతవారు బహు ♦ నానెముగా దమరిట్లు దిద్దగా
నెరుగనివారివద్ద దమ ♦ రేకియదెల్పిన జెల్లనేర్చెడిన్॥

ఉ॥ మక్కువగాదె జన్మమను ♦ మాటకుసాటి మరొండు లేదుగా
మక్కువతోడపుట్టి పది ♦ మారులు గిట్టుదురంతెగాని మీ
తిక్కతనంపు బుద్ధులకు ♦ దీర్పరు లెవ్వరులేరటన్న హా
మెక్కిన దుష్ప్రబోధకుల ♦ కెక్కడిదిక్కడ పోటిచేయగన్।

ఉ॥ ఇంతకు బూర్వమెవ్వరితో ♦ నీరమణీమణి కూడదాయెనన్
కాంతునివోలె నమ్మికొని ♦ కాపురమిప్పుడె చేయుచుండె ర
వ్వంతభయంబులేక సరి ♦ వారిలో నేవడివంక లేకనే
యింతిని గూడువానికెట ♦ నేనియుబాపభయంబుగల్గునే॥

క॥ గురిదప్పి తిరుగదెప్పుడు
నరనిముఖంబైన ఛాయ ♦ దాహోనను నీ
తరుణీమణి సుగుణంబులు
హరిహర బ్రహ్మాదులకు బ ♦ యల్పడగలవా॥

క॥ తగుపని కుద్యోగించును
తగనిపనింబూనదెట్టి ♦ తగవులకెపుడుం
దగుదునని పూనికసేయని
మగువన్ విడనాడునట్టి ♦ మనుజులుగలరా॥

మ॥ ధనరాసుల్ సమకూర్చిరాజులుమహా♦దర్పాంధులైకాముకీ
జనవాత్సల్యసమేతులై యెపుడు సం♦సారాంధ కారాబ్ధిలో
మునుగం దేలనివారలుంగలరె పా♦ముఖ్యాత్ములై సర్వదా
జననంబన్నది సంగదోషమెకదా ♦ సంచారభూతాళికిన్॥

క॥ తుదిమొదలు లేనిజగతికి
గుదురెక్కడ జిక్కదీని ♦ గూర్చినదేవరో
మదికేది దోచదాయను
చదివినఫలమేమి దీని ♦ సంధింగనుమా॥

మ॥ పరమోత్సాహముగా దెజవ్వనులసం♦పర్కంబుసిద్ధించుటల్
ధరలోనున్న సమస్తశాస్త్రముల వా♦దంబెల్లయుంబాపి సు

స్థిరమౌ దృష్టికి మార్గమెతనరి సం ♦ దేహార్తినిం దోలుచుం
బరలోకాప్తికి బాటకామినుల సం♦బంధంబు సామాన్యమా

క॥ అని తెలిపి తిరిగిపొండన
విని మంత్రివరేణ్యులంత ♦ విబుధావళితో
జని రేమి చెప్పజాలక
జననాథుని తమ్ముడనెడి ♦ చతురోక్తులకున్॥

ఆ॥ వె॥ అంతకొండవీటి ♦ కధినాథుడు లేక
రాజులేని గాథ ♦ రాత్రివోలె
దారిడొంకలేని ♦ తీరుగా బ్రజలెల్ల
మారుదశల జెంది ♦ క్రుమ్మరుచుండ॥

సీ॥ మామిడిసింగన్న ♦ మంత్రివరేణ్యుండు
కొండవీటిమండలి ♦ నుండవెరచి
యన్యరాజన్యుల ♦ యాస్థానములకేగె
బండితులంతట ♦ భయముజెంది
రాజులేనట్టి యీ ♦ రాష్ట్రంబులోనుండ
హాని చేకూరు నా ♦ హాయటంచు
మంత్రితోబాటు సా ♦ మ్రాజ్యాభిషిక్తుల
యాస్థానములకు వా ♦ రరుగుదెంచె॥

గీ॥ ధనికులే రాజధానికో ♦ జనిరిమున్న
తప్పుదెలియని దుర్జన ♦ దండనలకు
ప్రాణములు చేతబట్టుక ♦ బ్రతుకగోరి
పారిపోవుచునుండె సా ♦ మాన్యజనులు॥

మ॥ జనసామాన్యులు బాటసారులు వెసన్ ♦ సంసారులున్ భిక్షుకుల్
ధనవంతుల్పడు పాటులందలచియే ♦ ధాత్రీశుడైనన్నరే
మనలంబ్రోవగ రాడ దేమయనిరా ♦ మా రామయంచున్మదిం
జనులార్భాటము జేయుచుండి రకటా ♦ సర్వేశ్వరోపాసులై॥

ఉ॥ కూరిమిఁ బ్రోడ మంత్రివరు ♦ గూడుక బండిని లేగిరెప్పుడో
వారలకం డెముండెదె ధన ♦ వంతులు బోయిరియంతులేకనే
దారిని బోవలేక గడు ♦ ధర్మచరిత్రులు బీదవారలీ
చోరులఘోరకృత్యముల ♦ సుక్కుచునుండిరి రాత్రింబవల్॥

క॥ ఇలువెడలిపోవ వెరుగని
కులకాంతలు జారులౌచు ♦ కూతలుబెట్టి, ని
ష్ఠలజన్మమొందు కాయని
నలపోవుచునుండె ధాత్రి ♦ పతిలేకునికిన్॥

ఉ॥ కాలము మారిపోయి కలి ♦ కాలము దాపరమైన దస్యులల్
నాలుగువైపులన్ ఖలులు ♦ నమ్మకద్రోహులు త్రాగుబోతులుం
వాలు మొకంబులట్లుబ్రితి ♦ వారల హింసలు జేయుచుండె భూ
పాలుడు లేని రాజ్యపరి ♦ పాకము కెల్లరు జింతబోవగ॥

ఉ॥ ఇట్టివిధంబుగా బుడమి ♦ నేలెడి భూపతి లేమి జేసియో
త్తట్టున జూచిరన్ ఖలుల ♦ తర్జనభర్జనలగ్గమాయె మూ
కిట్టియునస్థలంగెడ ప ♦ నెవ్వరు చాలినవారలంచు గీ
పెట్టుచునుండి రెల్లజను ♦ లింతకు జేయునదేమి లేమిచేన్

వ॥ ఇంతట కొండవీటిరెడ్డిసామ్రాజ్య పతనంబగుట యెఱింగి లాంగూలగజపతియను నతండు కొండవీటి రాజ్యంబు నాక్రమించుకొని పరిపాలింపుచుండె దర్వాతికథాక్రమం బెట్టిదనిన

క॥ వనజాక్షభక్తవత్సల
ఘనకార్ముకహస్తదివ్య ♦ కౌస్తుభవక్షా
మనసిజహరసన్మానిత
సనకసమునిలోల రామ ♦ చంద్రనృపాలా

గద్య

ఇది శ్రీ జానకీరామచంద్ర చరణారవిందవందనకందళితాయ
మాన మానసుండును సకల విద్వజ్జనవిధేయుండునగు
శ్రీ చిట్టెపు బుచ్చిరెడ్డిగారి ద్వితీయ పుత్రుండును,
సహజపాండిత్య వేమారెడ్డిన్నామధేయ
ప్రణీతంబైన వేమనజీవిత చరిత్రంబు
నందు ద్వితీయాశ్వాసము.



1

శ్రీ వేమన గ్రంథాలయము
లైబ్రరి (కృష్ణా జిల్లా)

# తృతీయాశ్వాసము

శ్రీరఘుకుల రత్నాకర
మారీచప్రముఖశిక్ష ♦ మంజులసుగుణో
దారసురేంద్రాదిస్తుత
సారబలాభీల రామ ♦ చంద్రనృపాలా॥

వ॥ అవ్వాలి కథాక్రమంబెట్టిదనిన

క॥ ఈగతి వేమండెప్పుడు
నాగమణీయనెడి వేశ్య ♦ ననుప్రకాముడై
యోగియయిన తెఱగంతయు
బాగుగవినుపింతు వినుడి ♦ బహుపుణ్యమగున్॥

వ॥ ఇట్లున్న సమయంబున రాచవేమారెడ్డి పట్టమహిషియగు సుశీల తనమరదియగు వేమనవర్తనం బాత్మగతంబున

మ॥ తనవారెల్లరు జెల్లిపోయిరను చిం ♦ తం జేయడొక్కింతయుం
జనసామాన్యునిబోలె వేశ్యవశుడై ♦ సంప్రాప్తకష్టుండునై
యనుమానింపక రాజ్యభోగముల కా♦యాసంబునుంగోక వే
మనకాలంబును బుచ్చుచుండె దొలిక♦ర్మాధీనమానస్కుడై

ఉ॥ పోయెను రాజ్యమంచు దల ♦ పోయడొకింతమనస్సునందు న,
న్యాయముగా గతించెనని ♦ యన్నవిధంబను మాత్రమెంచకే
గాయనికామినీగణిక ♦ భావసముద్రమునందు గ్రుంకుచు
న్నీ యెడ కన్నముంగుడువ ♦ నెన్నడు రాడని చింతజేయుచున్॥

క॥ తనమఱఁదియున్న తావుకు
యనుదినమున్ భోజనంబు • నంపుచు వనదా
ఘుని యాత్మలోననెంచుక
దినములు వెడలింపుచుండె • వెలివింజెపకన్॥

వ॥ అంత వేమండొక నాఁడా నాగమణింగాంచి దరహసిత వదనుండ
గుచు.

ఉ॥ సామముదక్కెన్నన్ను చెఱ • సాలలోఁ బెట్టిన రాజరాజు పె
న్వాముచె గూలిపోయెనెడ • బాసిన దానవు జేసినావు యే
స్వామి దయారసంబున నో • చల్లగనుంచి తిమింత పట్టుకున్
కోమలి నాకు నీకు జత • గూర్చిన దేవుని బ్రస్తుతించెదన్॥

మ॥ భవదీయాద్భుత సృష్టి వైభవము ద • ర్పస్ఫూర్తి తా వాణికి
న్వివరింపంగ వశంబె నెందయిన నీ • విశ్వంబులో సర్వము
న్భవదీయాజ్ఞకు లోనుగా దిరుగుచున్ • బ్రహ్మాండ రూపంబునో
భవదీయోజ్జ్వల తత్వముం దెలియనే • బ్రహ్మాదులుం జాలరే।

ఉ॥ కుక్షిన జాండభాండముల • గూర్చుక నేక కుటుంబమోల్పగా
నక్షయసంపదల్ గలుగు • నట్టుగ నీపదదాసకోటి ప్ర
త్యక్షముగాగ వేషిన ద • యామయ తేజము జూపునట్టి యా
పక్షితో వంగుసిందలచి • బాయని నీక్షణో రామమూర్తికిన్॥

క॥ కరిపరద భక్తవత్సల
కరుణాకర ఘోరదైత్య • గర్వాంతకసం
గరలోక శిరోమణి, నా
వరదా పదాన్విత నీకు • వందనమొసగెదన్॥

వ॥ అని దేవునింబ్రస్తుతించి తనప్రియురాలి వామాంకపీఠంబునం
దత్తమిల్లి

క॥ వనజాక్షి నీ కతంబున
జననాథుండరిగె యముని ♦ సన్నిధి కిక నీ
వనుదినమానందాబ్ధిలో
మునుగుట కేయడ్డు లేదు ♦ ముగుదరో వినుమా॥

ఉ॥ ఎట్టితపంబుజేసి జని ♦ యించెదరోగదయూను వాండ్రుచే
పట్టినకార్యముల్జడక ♦ భవ్యశుభస్థితిజెందువారికాల్
బెట్టినతావులెల్ల నని ♦ నేయసుఖంబులోసంగు వీరికిం
బుట్టుకతో నెవచ్చెదమ ♦ పూర్వ తపోఫలభాగమన్నటుల్॥

క॥ మీమహిమలెఱిగి పొగడగ
నేమనుజుండోపగల్గు ♦ నేయుగమందా
తామరసగర్భులాదిగ
నేమయిరో యన్యవారి ♦ నిట్లన నేల౯

మ॥ ధనధాన్యంబులు రాజ్యముల్ గవిత గాం ♦ ధర్వాది నైపుణ్యముల్
ఘనవిస్తారమపారమై యెసగు మో ♦ క్షద్వారసందర్శనం
బును మీవల్లనె చేకురున్నరల సొం ♦ పుందక్క నిర్భిన్నమా
వనితారత్నమ దీనికింబదులు చె ♦ ప్పన్నొండులే దేమిక౯॥

క॥ సురగరుడ యక్షరాక్షస
నరకిన్నరవన్యులెప్పుడు ♦ నారీజన, మ
త్సరములతో నూరేగుదు
రరయగ మీకంటె ముఖ్య ♦ మవనింగలదా॥

వ॥ అది యట్లుండనిమ్ము
సీ॥ కలికినీవొకమారు ♦ కిలకిలనవ్వితే
బున్నమజాబిల్లి ♦ చిన్నవోడె
గరితనీవొకమారు ♦ కన్నెత్తిచూచితే
గంజాతములపెచ్చు ♦ నింజలిగొను
కాంతనీవొకమారు ♦ కనుబొమల్ విరిచితే
మరుడుకార్ముకమెత్త ♦ వెఱచుగాక
భామనీనెఱివేణి ♦ భాగ్యోదయముగన్న
కాలాహికేమైన ♦ గతులుగలవె

గీ॥ కమలదళనేత్రి నీమంద ♦ గమనమరసి
మదకరీంద్రింబులెందైన ♦ మెదలగలవ
యెట్టిజడదారులైననీ ♦ తట్టుగనిన
భంగపడిపోరెచేయు త ♦ పంబులెల్ల

వ॥ అనవిని భోగిని

ఉ॥ ఎంతటిదాననయ్య తమ ♦ రీక్రియ పెద్దగజేయనేల నీ
యంతటివారికిందెలియ ♦ నట్టిది యెందునైన నున్నదా
కంతునిదాటిపోర్వ నొక ♦ కాంతుడు లేనిదెయానుడైన బ
ల్వంతలపాలుగాదె తమ ♦ వంటిమహాత్ములెఱుంగకుండిరా।

ఉ॥ ఆరయ నెల్ల సౌఖ్యముల ♦ నంచుట కన్యకుగూడనున్న నె
వ్వారలకైనగాని బహు ♦ భంగులకష్టముగాదె యిట్టి సం
సారపయోనిధింగడువ ♦ సర్వమెఱింగిన వారలిట్టి ప్రి
స్తారణజేసిరే సుకవి ♦ సత్తమనీకు నమస్కరించెదన్॥

క॥ ఆడదిమగవాఁడిద్దరు
గూడినజగమౌను గూడ ♦ కుంటినవాఁడే
పాడింపఁబుచుజగమును
వాఁడుకలేకుండు నెల్ల ♦ వంతలఁడంగున్

శా॥ నాకుంజూడఁగనీవెదేవుఁడవు నా ♦ నాసౌఖ్యముల్ గూర్పఁగా
నీకున్నే నటఁ దోఁచుచుండెదను నే ♦ నే నీవనే సామ్యమై
యేకాలంబున కేదిప్రాప్తమగు నం ♦ తే దృప్తులౌ వారలీ
జోకందప్పక నేగుచుందు రెపుడున్ ♦ జోద్యంబు లేదిందులోన్

క। ఈ విధముగ వారెప్పుడు
భావజు నస్త్రముల కుం ♦ భయంపడకౌరా
పవలును రాత్రిరెఱుంగక
నవిరళసురతార్ణవంబు ♦ నందుగుఱింకుచున్

వ॥ వున్నంత వేమనవదినె గారాత్మగతంబున

సీ॥ నా మనోనాథుండు ♦ నాగుబాముచెగూలె
మరదివేశ్యతోఁ బొద్దు ♦ జరుపుచుండె
రడ్డిరాజ్యంబన్య ♦ రాజులచేజిక్కె
మంత్రులెశౌంచి రే ♦ మార్గముననొ
సత్కవిశ్వగులన్య ♦ సంస్థానములకేగి
రాధ్రిదేశంబు నం ♦ దంతటయును
దుర్భిక్షములదేవి ♦ తోఁగిచూచుచునుండె
సరవితో వర్షముల్ ♦ గురుపవాయె

గీ॥ గలయవేమన భోగిని ♦ కాటువలన
నింగితము దప్పిదాని యా ♦ లింగుడగుచు
నింద్రియోన్మాదుడగుచు రా ♦ జేంద్రపదవి
మానుకొనె నేమిచేతు నే ♦ మగువనగుచు॥

గీ॥ పుష్పాలమ్మిన తావుకే ♦ బోయిమరల
గట్టెలమ్మగబోవు తే ♦ క్కలివిధంబు
రాజ్యమేలిన తావునే ♦ రాణి మరల
బ్రజలతో బాటునుండ సం ♦ ప్రాప్తమయ్యె॥

గీ॥ పూనిజగమెల్ల గర్మాన ♦ దీనమగుచు
దిరుగుచుండునుదీన నె ♦ వ్వారికైన
ననుభవింపకదప్ప డెం ♦ దునకుజనిన
బూర్వకర్మానుబంధ సం ♦ పూర్ణఫలము

క॥ పతితోడ ముక్తినందక
గతిమాలినదాననగుచు ♦ గనుపుచుదినముల్
మితిలేని శోకవహ్నిలో
బతితాత్మకనగుచు నెట్టు ♦ భరియింపగలన్

వ॥ ఇవ్విధంబుగా నానా విధవిలాపంబులం జేయు చుండెనంత నక్కడనాగమణి యొక్కపండుగదినంబున వేమనంగాంచి మీవదినయగురాణీగారు ధరించెడి యాభరణంబులంగొని తెమ్ము మీనాడు పండుగదినంబు కావుననే నాయాభరణం బులంధరియించి నామూర్తిమంతంబు నీకుంజూపించి వెంటనే యిత్తునన విని వేమనవదినెగారి మేడకుబోయి తనమనంబున

సీ॥ వదినతో బ్రియురాలి ♦ వాంచితంబెఱిగింప
దనమనంబున కెట్టి ♦ తలపుగొనునొ
వట్టిచేతులతో నే ♦ నట్టిపోయినజూచి
యాకళావతికెట్టి ♦ యాత్మయగునొ
యంచువీరలమధ్య ♦ నటిటులుయ్యాల
లూగుచునుంటి నె ♦ ట్లుండబోనొ
మాముగ్గురాత్మ సం ♦ బంధంబుకెడమాచు
దైవమామీదనే ♦ దారిగొనునొ

ఆ॥ వె॥ యంచుబుద్ధి కెట్టి ♦ యాధారముల్ లేక
జేలయగుచువదిన ♦ మ్రోలకరిగి
వందనంబొనర్చి ♦ మందభాగ్యునిఁగాత
మాటలాడకింటి ♦ చాటుకుజని

ఆ॥ వె॥ పరుపురాళ్లయరుగు ♦ పైనబరుండి సం
తాపపడుచువేశ్య ♦ తలపెరింగి
యన్నభార్యకెదుట ♦ నున్న నేమనునంచు
నెటుదోచకచట ♦ నే పరుండ

వ॥ వదిన మరదిరాకకున్నాశ్చర్యపడుచు.

ఉ॥ కానకవచ్చెనా యితర ♦ కారణ మెయ్యదియైనగల్గెనా
పూనియనేకమార్లు కవి ♦ పుంగవులీతని కెన్నిచెప్పినం
బూనడురాజ్యమేల వెల ♦ బోడికెటింగుదొఱంగడిప్పు డీ
వ్వానినిజేరియేనడుగ ♦ వచ్చెను పోయెదనంచుజెచ్చెరన్.

మ॥ మరదీ యెందులకేగినాడవిటకున్ ♦ మర్యాదకుందప్పి యీ
యరుగుంజేసుక బవ్వళించితివి సా ♦ యంసంధ్యవేళాయ భా
స్వరసౌధాంతర వేదికల్వదలి భా ♦ వంబేదో భగ్నంబుగా
బరితాపింపగనేల రమ్మనిన వే ♦ మండామెతోనిట్లనెన్.

గీ॥ తల్లివై ననునీవెనా ♦ తండ్రివైన
నీవెకావునవినుము నా ♦ నిశ్చయంబు
నామనోకాంత వేశ్య ని ♦ న్నటిదినంబు
నందుగోరినయట్టి యా ♦ చందమెల్ల.

క॥ తనుబ్రేమించిన భోగపు
వనితామణివాంచితంబు ♦ వదినకుదెలుపన్
వినియామె భూషణంబులు
గొనుమిత్తును బోనమిచట ♦ గుడిచినమీదన్.

క॥ అనవిని వేమండంతట
మనమునసంతోషపడుచు ♦ మజ్జన విధుల
న్నొనరించి బోనముంగొని
మనుజేంద్రునియనుజుడున్న ♦ మందిరమునకున్.

వ॥ రాణీగారు తనయాభరణంబులంగొనిపోయి మరదికిచ్చి.

క॥ ఈనగలనెల్ల భోగపు
వనితామణికొల్చి నంత ♦ వదలకదానిన్
గనువిగత వస్త్రగమ్మని
మనమందున నిట్టిమాట ♦ మరువకుమంచున్.

క॥ అనువదిన సెలవు గైకొని
ఘనముగ వేమండు వేశ్య ♦ కడకుంజని తా
ననువొప్ప దొడవులెల్లయు
మనసారగనివ్వ నాగ ♦ మణిగైకొనియున్.

వ॥ వేమనా?

ఉ॥ పూనిభవత్తలంపు నెడ ♦ బోవకజెచ్చెర నిచ్చెనానగల్
మానినికిన్కతోడ నను ♦ మానము జేయుచునప్పగించెనా
దీనికి బ్రశ్న లేవయిన ♦ దేవితలంపున జేసిపల్కెనా
మానకజెప్పమన్న నను♦మానముతో బ్రియుడామెకిట్లనెన్.

ఆ॥ వె॥ అంతవదిన చెప్పి ♦ నట్టి విగతవస్త్ర
యనెడిమాట నాత్మ ♦ యందెడాచి
పోయియడుగ వినయ ♦ పూర్వకంబుగ నిచ్చె
దడయకేమి బదులు ♦ నడుగదాయె

ఉ॥ తల్లిసమానురాలు గదు ♦ ధర్మచరిత్రిణిగాదె రాణినా
వల్లననేక దుర్వినయ ♦ వార్తలనెల్లపు డాలకింపుచు
న్నెల్లపుడొక్కతీరునె గ ♦ ణింపుచుదండ్రివలెందలంచుయా
చల్లని శీలమాంబ పద ♦ సన్నుతిజేసిన బున్నెమబ్బెడిన్.

క॥ అను వేమనపల్కులు విని
వనితామణి జలకమాడు ♦ వాంఛితయై వే
మన సెలవునందుకొని వే
చనియెన్ గణికాలలామ ♦ సంతసయగుచున్

సీ॥ సంపంగినీటిలో • జలకేళిసవరించి
వలిపెనీర్కావి పా • వడధరించి
సేరైనజలతారు • చీరెశృంగారించి
రాచిల్కవన్నెల • రవికెదొడిగి
పునుగుజవ్వాది క • ర్పూరముల్ దిగబూసి
పొల్పుగానెలవంక • బొట్టుదిద్ది
రాణిగారిచ్చిన • నాణెంపుసొమ్ముల
బాగుగామేన నే • ర్పాటుపరచి

తే॥ గీ॥ కనులకాటుక రేఖ పొం • కముగదీర్చి
విడెముసేవించి కొప్పుపై • విరులజేర్చి
యందమెసంగ వేమన • ముందుకరిగి
నాథుడాయంచు పక్కన • నవ్వుచున్న.

ఉ॥ దానినిగాంచి వేమడతి • దర్పితుడై సకలోర్వియందునీ
మానినికెవ్వరీడు యన • మానకళావిభవాదులందు ని
ద్దానికి దేవకాంతలు వృ • థాబొలివోరె మదీయపూర్వ పు
ణ్యానుఫలంబుగాక నిత • రంబున కేక్రియదక్కు నీక్రియన్

వ॥ వెంటనే తనవదినగారితలంపు దనయాత్మకుం దెచ్చుకబ్రియు రాలా భవదీయ వాంచితబుందీర్చితిని గాని మదీయహృదయానంబుం జేయ నాయెదుట దిగంబరివై యొకముహూర్త కాలంబు నాట్యంబాడుమనిన దెలియకావేశ్యవిగత వస్త్రయై నటించుదానింగాంచి వేమన.

చ॥ పిడుగులరావముల్ విని గు ♦ భిల్లున గుండెలుజారునట్లుగా
బడలిక కళేబరంబుదడ ♦ బాటున గాంచి యిదేటిభూతమి
క్కడ దడవుండరాదు కల ♦ కాలము దేవుని మాయశక్తు లీ
వడువున మోహమందుమగ ♦ వారల నెందులకెక్కకీడ్చెడిన్॥

మ॥ నవరంధ్రంబులతోలుబొమ్మయిదినా ♦ నాజాడ్యసంభూతమై
పవలున్ రాత్రియన్న పెందెరలపై ♦ బ్రహ్మాండభూతంబుగా
భవబంధంబను నాట్యరంగమున ♦ డంబస్ఫూర్తిమాధుర్యమై
కవిగానియ్యదికల్కుచున్న దిదియే ♦ కాలాంతకస్ఫూర్తియై।

చ। వనముల నాకలంబుదిని ♦ వంతలగుందుచు రాత్రింబవల్
ఘనజననస్థితి ప్రళయ ♦ కారణభూతుని పద్మనాభునిం
దనుకని బుద్ధితో దలచు ♦ ధన్యుల గ్రిందికిమీదికీడ్వ నీ
వనితలపంపకంబిడిన ♦ వానిచమత్కృతి నెన్నగానగున్।

మ॥ నిరహంకారులు ధర్మమార్గనిరతుల్ ♦ నిష్ఠైకపారీణులౌ
వరమౌనీంద్రుల భంగపెట్టుటకు స ♦ వ్యాలేయువారల్గదా
గరితాలోకపిశాచులెల్లపుడు నా ♦ కా దీనితో సఖ్యముల్
పరువుందప్పగనయ్యెనాహృదయదౌ ♦ ర్భాగ్యంబు కేమందికన్

గీ॥ జననమరణాద్యవస్థలు ♦ గనగరాని
శోరముర వైరి పాదపం ♦ కేరుహముల
జింతజేయక భోగిని ♦ చెంతనడగి
కాలమంతయు రిత్తగా ♦ గడపితినని॥

వ॥ వేమన తన పూర్వజ్ఞానం బించుక వెలివడినవాడై నాగమణి
యందనురాగంబుదక్క మారుమాటాడ కేగువానింగని వేశ్య
వాని డాయంబోయి

ఉ॥ నన్నొక యుక్తిజేసి విడ • నాడగజెల్లునె తొల్లినాతో మీ
రన్నటువంటి బాసలు బ • యల్పడజెప్పెదనాలకింపుమా
నిన్నడబాయజూడు మవనీ • స్థలిగ్రుంగిన మిన్ను వంగినన్॥

క॥ తప్పులు నాయెడగల్గిన
జెప్పుడు మీరేయుశిక్ష • జేసెద నిపు డీ
చొప్పుగ మీరే తెంచుట
తప్పనివాదింతునింత • దడువక నీతోన్॥

సీ॥ గదిసి తోల్బొమ్మలాడు రం • గస్థలమున
నంకురించిన మొక్క వీ • శంక బూని
నవబిళంబుల శక్తులీ • నారులంచు
బారిపోవగ నేల ని • ర్భాగ్యుడట్లు॥

సీ॥ పంచశరు నిల్లుగాదె పా • పంచమనెడి
భూతకోటికి దారి సొం • పుల మిఠారి
వలపులెగజల్లుబావి విం • తలకు లోవి
కాదె భగమెన్న బిళమను • వాదనేడ॥

ఉ॥ మోహామువల్లబుట్టుజగ • ముల్ మరలన్ సమయింపనద్ది యే
దోహదమై చెలంగుబెడ • తోవనుమాటహుళక్కి సుమ్మ సం
దేహము లేనిమార్గమిది • దేవునిచే దొలినాడెగల్గె నీ
యూహాల కేమిరమ్ము మెప్పు • డుండిన దెక్కడి కేగు వేమనా॥

క॥ అనవిని వేమం డిట్లనె
వనితా నీపన్నదెల్ల • వాస్తవమగు నా
మనమందు నున్నదానిని
వినుమా వివరింతు నంత • విశదపడంగన్॥

ఉ॥ పూని యనేకజన్మముల • బొందుచు గర్మవశీకృతుండునై
మానకనాడుదాని పెను•బంధసమావృతచిత్తుడైకదా
మానుపు డెట్టుగాని పశు• మార్గుడునై ధన పుత్రమిత్ర సం
తానభిలాష యన్కడలి • తం పరలంబడి కుంపుజెందెడిన్॥

క॥ తరుణీసంగమ మెప్పుడు
మరగియనేకార్జితముల • మత్తుండై యే
నరుడెడ తెగ కీ విధమగు
నరయ నతం డిహపరంబు • లందక జెడెడిన్॥

గీ॥ వినుము వైదర్భి దేహ సం • జనిత రోష
దుఃఖసంతోషములకు వి • ద్యుక్తులవక
శాశ్వతంబైన దేదో యా • చందమరసి
పూని సాధింపువాడె పో • మానవుండు॥

మ॥ అళినీలాలకజాలిబొందవలదాహా • దేహముంజూడగా
మలమూత్రింబులువాతపిత్తముల సం•బంధంబునై నీటి లో
పల జూపట్టెడిబుద్బుదంబులటుసం•భావింప దోల్మోమ్మనై
మలుగుందీపవిధంబుగా నిలువద•మ్మా దేహమిందెప్పుడున్॥

వ॥ మరియు నో విలాసిని, జన్మనాశంబులకుం గురియగు దేహ
సౌభాగ్యంబుంగోరికదా యనేకు లనేక దుర్వ్యాపాలం

జేయుచు వృద్ధిక్షయంబులం గాంచుచు నానావిధ కష్టంబులకు లోనగుచు వృధాప్రయాసంబులంబడి తీరికలేనియాశాపాశ నిబద్ధాత్ములలై తుద కెందునుగానివారలగుచు నిహపరసౌఖ్యంబుల కూరక దూరమై చెడుచుందురబల॥

క॥ కొందరిటువంటి దుస్తర
చందంబుల కరుగకెపుడు ♦ శాశ్వతుడగు గో
విందునిపద సేవ్యులరై
మందతనంబుడిగి ముక్తి ♦ మార్గులరయెడిన్॥

మ॥ అనయంబుల్ దలపోయ నేనెపుడు♦నన్యాయంబులేదిందునా
మనమందింతట శాంతిబొందితినికో♦మ్మాయావనారాటముల్
జననంబందుట కేమికారణమొసం ♦ సారాదులంబాసియా
మునులాకోనలకేగుటెందులకొత♦న్మాలంబునుంగాంచెదన్॥

వ॥ కావున నిన్నిప్పుడు విడనాడినానను సంతాపభరంబుడిగి నీవును నావలె నన్యతలంపులంబాసి పునర్భవభయనాశంబగు దేవు నారాధింపు మటపై విశ్వాలయనివాసుండగు భగవానుం డాదరణీయుండగుగాకయని వేశ్య నచ్చోట నిలువరించి వేమన తనగృహంబునకుంబోయి

క॥ తనయింటిపనులు జేసెడి
ఘనుడభిరామయ్య విశ్వ ♦ కర్ముడుగల డా
తనిగూడియుండి వేమం
డనుదినముం బొద్దుబుచ్చు ♦ నత డెఱుజనకన్॥

వ॥ అంత నక్కడ గణికాలలామంబా వేమనసూరిజనోక్తుల కంగీకృతయై నిజనివాసంబునకున్న రిగి

క। కామకళావ్యాపారము
వేమనతో దీరెనింక ♦ వెతలంబడ కే
స్వామిపదధ్యానంబనె
నీమంబున నుందు జన్మ ♦ నీరధిగడతున్॥

మ॥ అని శ్రీరాముని మందిరంబునపుడే♦యచ్చోటనిర్మించి దేవుని సాన్నిధ్యముజేరి చిత్తవికలం ♦ బుం గాపి నిస్తారతిం దనువుం బ్రాణమనిత్యమీజగతి ని ♦ త్యంబేదికాదంచు వేమనవాక్యంబులె వేదవాక్కులనిసం♦భావింపుచున్నాత్మలోన్॥

వ॥ కొన్నాళ్ళకా రామాలయంబు నొదిలి

మ॥ వనమార్గంబుల కేగి సన్మునులతో ♦ వాత్సల్యసంపాదియై ఘనయోగాదిపరిశ్రమావళుల దీ♦ క్షంబూని చైతన్య దుర్వినయాంభావతమోలతావళులకూ♦ర్మిం దెగ్రించి దేదీప్యమా వనజాక్షుంగని ముచ్చటించెదను ది ♦వ్య ప్రాభవోపేతనై॥

వ॥ అనుతలంపుతో మహానంది పర్వతంబు జేరుక నందొక్క గుహంజేరి తపం బాచరింపుచు

చ॥ దినమునకొక్కసారి తన ♦ దేహము నిల్పగ బండుటాకులం గొని సెలయేటినీరుగొను ♦ తీరనియోగపరిశ్రమంబుచే తను, తనువెల్లడస్సి భయ♦దంబగుఘోరమృగాళియందు భీతినిగొన కొక్కతే దిరుగు ♦ దేవునితత్త్వమహత్త్వశక్తితోన్॥

చ॥ దినదినవర్ధమాన పరి ♦ దీపితయోగపరిశ్రమంబుచే
వనిత చరింపుచుండె వన ♦ వాసులకుం దలమానికంబుగన్
జనితవియోగదుర్దశల ♦ సంగతి కావలి బుద్ధిశోడ నీ
వనిత సుశీల యంచుభగ ♦ వంతుడుమెచ్చుటకేమి లెక్కకన్॥

ఉ॥ ఆవనసీమలం దిరుగు ♦ నట్టి తపోధనులామెనొక్క స
త్పావనవర్తనంబుకు సె ♦ బాసని మెచ్చుదురామెవద్దకుం
బోవుచు వచ్చుచుందురట ♦ బోయెడువచ్చెడివారినంక నెం
తేవిమలాక్షి కోరికన ♦ దేకమనోనియమప్రవీణయై॥

క॥ జడివాన లెండగాలికి
నడగుచు బెఱమృగములందు ♦ నాడుచుదిగులుం
బడని మనోనియమంబుల
బడతి తపంబిడువక్కిల్లు ♦ బరగుచునుండెన్॥

వ॥ అంత నిక్కడ వేమం డొకనాడాయభిరామునిగాంచి

క॥ వేళకురా వేప్రొద్దును
కాలహరణ మేలనీకు ♦ గల్గునటన్నన్
జలకంబులాడి జపము
న్సలిపెదుతరి కింత ప్రొద్దు ♦ జరుగునటన్నఁ॥

క॥ పొందుగ వేమం డాతని
చందం బరయంగ నతని ♦ చావడి కెదుర
న్నందంబగు నొక తింత్రిణి
యందొక శాఖాగ్రమెక్కె ♦ నత డేమవనే

క॥ అంతట కోళ్ళుంగూసిన
సంతోషముతోడ బూజ ♦ సమయంబని, ని
దాంతంబు జేసి రాముడు
వింతగ జలకంబునాడి ♦ విరులుగోసుకన్॥

వ॥ కొండవీటి పర్వతంబున కుత్తరభాగంబుగా నొక్కబిలంబుం దూరి యందున్న మునిపతిం డాయంబోయి

చ॥ గురునిపదారవిందముల ♦ కుం బ్రిణమిల్లి సుగంధపుష్పము
ల్వరుసతో జిల్కుచున్ గురుని♦వద్ద నియామకబుద్ధితోడ సం
స్మరణమొనర్చుచుం బెరుగు ♦ పాలునుచెక్కెరజుంటితేనియ
ల్దరుగనిదీక్షతో గురుని ♦ దాపునబెట్టి నమస్కరింపుచున్॥

క॥ పూనితి నీ పదభక్తిని
నానాదుర్వ్యసన పంక్తి ♦ నాశనమొందేన్
మానితమునికుంజర నీ
ధ్యానపరిభావంబెఱుంగ ♦ దరమే నాకున్॥

క॥ నీపాదసేవకత్వము
బ్రాపకమై కడచెనయ్య ♦ పదికెండేడుల్
దాపసకులచింతామణి
నా పాపము తెల్లదోలి ♦ ననుబ్రోవుమనన్॥

వ॥ మునీంద్రుం డభిరాముని కిట్లనియె

క॥ మెచ్చితినీ శుశ్రూషకు
నిచ్చెదనొక వరము రేపు ♦ నింతకుముందే
వచ్చియొకమారు బోన్మో
నిచ్చట దడవుండ కేగు ♦ వెట కేనటపై॥

క॥ అనువీరిమాట లెల్లయు
వెనుకరహస్యముగనుండి ♦ వేమన విని గ
మ్మున దిరిగివచ్చి మరుదిన
మున వేమన యర్ధరాత్రి ♦ మున మునికడకున్॥

మ॥ చని పుష్పాక్షత ధూపదీపములతో ♦ సంతోషునింజేసి వం
దనమర్పించి యనేక వన్యఫల సం ♦ తానాదులన్నిచ్చి, వే
మనపూనిందుగ్రనియున్న తాకృతికినే♦మాయంచు బెల్లుబ్బి తా
ననియెన్ వేమనయందుగ్రనన్ను మునివ♦ర్యాబో్రవుమానీకృపన్॥

క॥ వినిపూని వేమనంగని
ఘనుడభిరామయ్య రాని ♦ కారణమే మా
మాతని కేమియగుదు వీవన
విను మభిరామునకు ముఖ్య ♦ ప్రియశిష్యుడనేన్॥

వ॥ ఈదినం బభిరామయ్యకు దీడుబడిలేక నన్నంపగా వచ్చితినన విని నిర్భాగ్యునకు నేడే తీరికలేకపోయెనా యని ముని విచారాక్రాంతుండగుచు

క॥ చనుదెంచిన వేమనఁ గని యొడ
జనితదయాహృదయుఁడగుచు ♦ సత్వరమున వే
మనకుపదేశించెనుగద
మునిగోప్యంబైన మంత్రి ♦ ముంగొనుమంచున్॥

వ॥ వెంటనే యాని యదృశ్యుండయ్యె నంత వేమన ముని యుపదేశప్రభావంబుచే వెన్కకుందిరిగివచ్చి యీయుదంతంబంతయు నభిరాముని కెఱింగించిన

క॥ వనజాక్ష భక్తవత్సల
ఘనకార్ముకహస్త దివ్య ♦ కౌస్తుభవక్షా
మనసిజహరసన్మానిత
సనకసమునిలోల రామ ♦ చంద్రనృపాలా॥



ఇది శ్రీజానకీరామచంద్రచరణారవింద వందనకందళితాయమాన
మానసుండును సకలవిద్వజ్జనవిధేయుండునగు శ్రీచిట్టెపు
బుచ్చిరెడ్డిగారి ద్వితీయపుత్రుండును సహజపాండిత్య
వేమారెడ్డినామధేయ ప్రణీతంబైన
వేమన జీవిత చరిత్రంబునందు
తృతీయాశ్వాసము



# చతుర్థాశ్వాసము

శ్రీలక్ష్మీప్రియవల్లభ
ప్రలయాంతకరూపదైత్య ♦ బలమర్దన ని
ర్దలిత మహాపాపోత్కర
జలరుహదళనేత్ర రామ ♦ చంద్రపవిత్రా ॥

వ॥ వినియభిరాముం డా వేమన నవలోకించి ॥

మ॥ పదిరెండేడులు దీక్షతోడ ముని స ♦ త్పాదాబ్జముల్గొల్చి నే
తుదకాహాని దయార్ద్రదృష్టులకు నెం♦శో దూరమైనాడ, ని
య్యది యే పెద్దలుబల్కుచుందురిలన♦వ్యక్తుండు చేకూర్చు న
య్యది వేరొక్కని జెందుచుండుననుసా♦మ్యంబేలశూన్యంబగున్ ॥

క॥ కరములు ముకుళించి మునీ
శ్వరుపాదములంటపూని ♦ సరగుననన్ దా
గరుణించి యానతిచ్చిన
పరమరహస్యంబు నాకు ♦ బ్రాప్తించదయెన్ ॥

క॥ కుసుమాక్షత గంధాదుల
విసువుగొనక మునిపదార ♦ విందములు సదా
నిశలు బన్సేవించితి
నశనాదులయందు సంత ♦ సంటసిమదిగోన్ ॥

వ॥ అని పెన్నిధింగోల్పోయిన పేదచందంబున వేమన నవలోకించి

గీ॥ మహానివర్యుండు చెప్పిన ♦ దానినెల్ల
తెలియజెప్పిన మేలు నా ♦ వలన నీకు
ప్రాప్తమైనట్టి పరమ మం ♦ త్రప్రభావ
మేదిబోధింపుమనిన స ♦ మ్మోదుడగుచు॥

వ॥ వేమం డభిరామున కిట్లని చెప్పదొడంగె॥

క॥ హితముపదేశించెద నీ
వతినిర్మలబుద్ధివగుదు ♦ వదిగాక జన
స్తుతవర్తన శీలుడ వం
చితహితుడవుగాన మేలు ♦ జెప్పెదవినుమా॥

క॥ కాలమెరిగి విషయాదుల
జోలికిబోనివ్వ కెందు ♦ జొరనీకమదిం
బాలపశుతుల్యుడవ కీ
వాలెరిగి చరింపుమయ్య ♦ వదలనివేడ్కన్॥

వ॥ వినుమీ ప్రపంచహేతుకంబయిన జననాది విశేషంబు లెఱింగించెద స్త్రీపురుషసంయోగ పరిశ్రమసమయంబున శుక్లశోణితంబులేకంబునై క్రమక్రమంబుగా కరుడుగట్టి యమేధ్యమధ్యంబున వృద్ధిబొంది కాలానుసరణిగా మాసంబుల వరుస నవయవంబు లేర్పడి పూర్ణశిశువుండగుచు వాయుసంభూతుండై॥

క॥ నెలవెడలి యోనియనియెడి
బిలమునబడివచ్చువేళ ♦ విజ్ఞానుండై

తలదాటి కలినిగన్గొని
చలితమనోభయతమాయ ♦ జలధింబడెన్ ॥

వ॥ అంత శిశుత్వంబున శుభ్రమశుభ్రమెఱుంగక మూత్రపు
రీషాదులం దేలియాడుచు గొన్నాళ్ళకు శాపపుణ్యంబు లనే
విచక్షణంబెఱుంగక నెన్నియోదుర్వ్యచేష్టలం బొద్దుబుచ్చు
నటపై

క॥ యౌవనదశ ప్రాప్తించిన
బవలుంరేయనక బాప ♦ భయముంగొనకే
యవిరళగతి నింద్రియముల
వివరంబులలోనె ప్రొద్దు ♦ వెడలింపనగున్ ॥

వ॥ అటపై కొన్నాళ్ళకు తారుణ్యమదాతిశయంబు లుడిగి
వృద్ధుండై

ఉ॥ ఇంతకు బూర్వమాతడు స ♦ హించి చరించిన దుష్టవర్తనా
లంతములేని జాడ్యమను ♦ నట్టి మహాత్తరకాలశక్తి దా
దంతములందుజిక్కి పరి ♦ దర్పిత బాధల కోర్వలేక వి
శ్రాంతి నెఱుంగకుండు మది ♦ చంచలమింతకు హేతుభూతమై॥

సీ॥ కావున సంసార ♦ గహనంబులో జిక్కి
దారసుతాది వి ♦ త్తములబోలు
శరభశార్దూల దు ♦ ష్కరమృగావళులలో
దీరని భయదుఃఖ ♦ భారములచె
మల్లడిగొని దీని ♦ మార్గ మన్వేషించి
దాటిపోవంగ నే ♦ దారిలేక

ధృతిజెడి దీనుడై ♦ తేఁకిచూచుచు దిశల్
కాలసూత్రంబుచే ♦ కట్టుబడుచు

ఆ॥ వె॥ కామక్రోధలోభ ♦ కలుషితాత్ముండునై
యన్యజనుల జెఱుప ♦ నాత్మదలచి
తానుజెడుచుతుదకు ♦ ధర్మవిదూరుడై
యమునిదండనమున ♦ క్రిమ మెఱుంగు

వ॥ ఇట్లు కామక్రోధలోభ మోహాది గుణవికారంబులనే క్రూర గ్రాహంబుల బారింబడి ధనపశుపుత్రభార్యా వ్యామోహం బనుమహార్ణవమధ్యందిరుగుచు.

సీ॥ ఏగిలేచిన దాది ♦ నెదిరి కొంపలుగూల్చు
వారు, పరకాంతలన్ ♦ గోరువార
లంచితంబని జీవ ♦ హింస జేసెడివారు
నమ్మించిగొంతులన్ ♦ నరుకువారు
మేరలేని యకార్య ♦ పారీణులౌవారు
తప్పుడుసాక్ష్యముల్ ♦ జెప్పువారు
ధనమున్నదని పిచ్చి ♦ పనులుజేసెడివార
లవలీలగా బొంకు ♦ లాడువారు

తే॥ గీ॥ రీతిదెలియని మానవ ♦ జాతియగుచు
ఘోరకిల్బిషభూరి సం ♦ సారవార్ధి
గడవనేరని జన్మముల్ ♦ గడపుచుంద్రు
పరమదారిద్ర్య మానవ ♦ పశువులగుచు.

వ॥ ఇట్టివారలనేక దురాచారశిరోమణులై యనేక జన్మంబు లెత్తుచు దైవదృష్టికత్యంతదూరంబగుచు నవసానకాలంబున యమదూతలబారింబడి నానావిధభయంకరశిక్షలకుంబాత్రులగుచుందురు. విమల విద్వాంసులెల్లప్పుడు సన్మార్గంబుల వర్తిల్లుచు దృశ్యంబగుచున్న ప్రాణిసముదాయంబులందు సమబుద్ధింజూపుచు స్వార్థకలాభడాంబికవ్యవహారాదులకవ్వలివారలై భుక్తిముక్త్యాదులకై దేవునారాధింపుచు పునర్జన్మరాహిత్యంబగు సత్యలోకప్రాప్తింగాంచెదరని.

క॥ ముని తెల్పిన భావంబిది
యనవిని యభిరాము డప్పు ♦ డా వేమనకుం
మనసార వందనబిడి
చనెవనసీమలకు సిద్ధ ♦ సాన్నిధ్యముకున్॥

వ॥ అంత వేమన కొండవీటియందొక్క పొలంబున పిచ్చిపుచ్చ విత్తులనాటి తనతపోబలంబుచే బంగారుకాయలంగావించి ప్రజలకుంవిశదపరచి వెంటనే పశ్చిమదేశోన్ముఖుండై

ఉ॥ జానుగనంది కొండమల
సన్నిధికింజని యొక్కనాడు వి
జ్ఞానవతీలలామయగు
నాగమణింగని యెవ్వరీపె డీ
కాననవాసియయ్యెదిన
గట్టుకొనుంగని యోగిపోల్కి-గా
మానినిచూచుచుండె బర
మాత్మని రెండవ తేజమోయనన్॥

ఉ॥ శారదరాత్రులందు మన ♦ సార వియత్తలమార్గమందు నం
దారమనోవిభుండు పరి ♦ దర్శితకాంతులొసంగుమాడ్కి నీ
నారిముఖారవిందమున ♦ నవ్వులవెన్నెలకాయుచుండె నె
వ్వారికుమారియోమగని ♦ వర్తన మెట్టిదొ దెల్పదయ్యెడిన్॥

ఉ॥ మేలిమిచాయనైననుప ♦ మింపగజాలిన దేహకాంతితో
మాలతిపుష్పమాల ♦ జపమాలగ ద్రిప్పుచు దాపసాకృతిన్
వాలుమెకంబులందు ముని ♦ వర్గములో నవలీలబోవు నీ
బాలయ మోఘయుద్యమము ♦ పండితగోష్ఠికి నగ్గమించెడిన్॥

ఉ॥ ఈ సతిపాదపల్లవము♦లెప్పుడు గొల్చుటె మోక్షమంచు స
న్న్యాసులుయోగిపుంగవులు♦నైనమహాత్ములుదాపసోత్తముల్
జేసెడి వర్తనంబుడిగి ♦ చేడియ వెంబడి మూకజుట్టుకం
దాసులవోలెబోయెడి వి♦ధంబరయన్ బహుచిత్రమయ్యెడిన్॥

క॥ ధృతివదల దెంతయును మది
చెదరనియదు ఘోరమృగుల ♦ చెంతంజనుచో
మితవగు నియతికి నల పశు
పతికోపెడ సాటిబోల్ప ♦ వచ్చునటంచున్॥

క॥ అతిపాపచిత్తులైనను
సతతం బీయువంటికాంత ♦ సన్నిధినుండన్
మతిమంతులగుదురటపై
చతురోపాయంబులెఱుగ ♦ జాలెదరంచున్॥

వ॥ కావున పరమేశ్వరాకారంబై కైవల్యప్రాప్తికిం దారాడు
యీ నారీమణింజేరి యమ్మహాపుణ్యావతీవిధానం బెఱింగెద
నని యామె చెంతకుంబోయి॥

# వే మ న జీ వి త చ రి త్రి ము

సీ॥ ఇందీవరాక్షి నీ ♦ వెవ్వారిదానవో
వందనమమ్మ పూ ♦ ర్ణేందువదన
వెఱపులేకీయుగ్రి ♦ విపినాంతరంబున
సంచరించెదవు ని ♦ స్సంశయముగ
యింతి నీకీ మార్గ ♦ మేగురుండెఱిగించె
నమ్మ నీ పూర్వ పు ♦ ణ్యానురీతి
గాకనేయుగములం ♦ దేకాంత లీ క్రియ
గలిత సంసార ని ♦ ర్గళితలగుచు॥

గీ॥ శరభశార్దూలభల్లూక ♦ సముదయముల
నిలువరానట్టి దుర్గమ ♦ స్థలములందు
మెలగుచున్నావు జపతపో ♦ బలము వలన
భూరిసంసారగహన సం ♦ చారముడిగి॥

వ॥ ఇదియునుగాక

క॥ జననీజనకుల వదలుక
ననుజుల హితవతుల సుతుల ♦ కందరికెడమై
వన జంతురావములలో
దనువున కాసింపవెట్టి ♦ ధైర్యమొ చెప్పుమా॥

వ॥ అనువాక్యంబుల కా యువతీలలామం బేమి సమాధానంబు
బీయకున్నం జూచి వేమనమగుడ

క॥ ఎవ్వారిదానవు నీధవు
డెవ్వరుపేరేమి పుత్రు ♦ లెందరు నీకీ
యవ్వనపు సమయమం దిటు
లివ్వనమున నుండవేటు ♦ వేమిమృగాక్షి॥

వ॥ అనవిని నాగమణి వేమనకిట్లనియె

ఉ॥ పావనమైన వేశ్యకుల ♦ భామను నాగమణీయభిఖ్య భి
ఖ్యావతి పుత్రికన్ నయవి ♦ శారద గేయ సమర్థ నాదునే
భూవినుత ప్రభావుడగు ♦ పుణ్యుడు వేమనకాలినాదునే
నీ విధిగా జరింప గత ♦ నేమన దెల్పెద నాలకింపుమా॥

వ॥ కొండవీటిరెడ్డిరాజులలో నారవవాడగు రాచ వేమారెడ్డి సహోదరుండగు వేమనకుం బ్రియురాలినై వత్సరత్రియం బవ్వానితో సంసారసుఖంబులం గాంచి యటపై నమ్మహా మహునిచే మంత్ర జపతపమోక్షమార్గోపాయంబులెఱిగిన దాననై వెంటనే యిమ్మహాగహనంబుం జేరుక దపోవతినై

ఉ॥ పండిన రాలుటాకులను
భక్షణజేయుచు రాత్రింబవల్
కొండల నీరుద్రావుచు య
కుంఠితయోగ సమాధినిష్టచే
దండిమదేభసింహ మృగ
దండడికిన్ వెనుదీయకుందు నీ
కొండబిలంబులందు ముని
కుంజరులెల్లరు దేరిచూడగన్॥

క॥ సుడిగొను గుణదోషంబుల
సడినెఱిగి యచంచలంపు ♦ సత్వాయుధమున్
వెడమీఱబూని వాటిని
గడితేర్పుచునుందు నెట్టి ♦ గాబరగొనకేన్॥

వ॥ ఇట్లు కొన్నాళ్ళు జరిపి క్రిమక్రిమంబుగా నిప్పుడు

ఉ॥ పండిన యూకులం దినెడి
పద్ధతిమానుక దివ్యదృష్టిచే
గొండల నీరు ముట్టను య
కుంఠిత పూర్ణసమాధిసిద్ధితా
ఖండల వైభవోన్నతుల
గైకొని వాయువు నారగింపుచుం
బండిన తాపసోత్తముల
భంగిజరింపుచునుందు నేననన్॥

క॥ అన విని వేమం డపు డా
వనితామణితో డబల్కె ♦ వదలక నిపుడే
నను నీ శిష్యుని జేసుక
మనమున గృపసేయు మిట్టి ♦ మార్గంబనినన్॥

వ॥ అయ్యా నీ వెవ్వరివాడ వెద్ది నామధేయంబనిన నతండు రాచవేమారెడ్డి తమ్ముండనగు వేమన నన విని యయ్యింతి

క॥ తొలి నా ప్రియుడనబరగిన
బలియుండీతండె మోక్ష ♦ భావములట్లై
దెలిపిన గురువరుడీతడని
లలనామణి మొక్కి లేచి ♦ రయమున వేడ్కన్॥

వ॥ కదళీ ఖర్జూర ద్రాక్షఫలంబులతో బుప్పరసజాంత్రి తేనియూ దులగురుండు తృప్తుంగావించి వెండియు మెడయందొక్క పుష్ప హారంబున్నిలిపి లలాటనిబద్ధాంజలియై నిలువంబడి

మ॥ పరమానందము జెందితిస్మరల నీ ♦ పాదాబ్జముల్ గొల్చినీ
వరబోధామృతపానమత్తనగునా ♦ పాపౌఘముల్ బాసె స
ద్గురువుల్ రాకయె మోక్షదర్శనముగా♦కొండేమివాటిల్లునా
కరుణాసంగముగా దెమీహృదయలో♦కంబెన్నగామాయెడన్

క॥ గురుతెరుగనివారెల్లరు
గురువులమని చెప్పి వేద ♦ గోష్ఠి నెరుగకే
పసువులుజెడ సంపాదన
పసులగు నా గుసులజూడ ♦ శాపంబరెుక్కిన ॥

వ॥ మరియు నీలోకంబులో సోమయాజులు దీక్షితులు చయ
నులు శాస్త్రిలు పరమహంసలు స్వాములు యతులు సన్న్యా
సులు విరాగులు బైరాగులమను యసార్థకనామడాంబికులకై
సత్రింబులు చెఱువులు బావులు వసంత్రింబులు వేయింతు
మను నెపంబుచే లోకుల విత్తహార్జించి రౌరవాది మహా
నరకంబులంబడుకంటె నిట్టి మహత్తర గహనాదులం జేరుక
గందమూలాదులం దినుచు దపోవృత్తిం దిరుగుచు కాలం
బెడలించుట యుచితంబను నాగమణితో వేమం డిట్లనియె

మ॥ వనితానీవలె సాహసంబు గానవె ♦ వ్యాకాదు రీయుర్విలో
వనితావాంఛ వహించిద్రవ్యమునకై ♦ వర్తించులోభాత్ములీ
వనమధ్యంబున క్రూరజంతుతతిలో ♦ వర్తింప సామాన్యమా
దినముల్ ద్రోయననేక దుర్వ్యసనసం♦ధిగ్ధాత్ములావారికిన్॥

చ॥ అది యటులుండ నీవు మును
లందరు జూడదిగం బరాకృతిన్
మెదలెదవీ నగాగ్రమున
నేటిశివుం డల వెండి కొండపై
కదనము దొర్కు చుండుట ది
గంబరుడై సురలద్రి రాయనన్
సుదతిరొ నిన్ను జుట్టుకొని
చూచు మునీంద్రులిల పుణ్యమేమనన్॥

గీ॥ మఱియు సంసారమగ్నులై ♦ దిరుగునట్టి
వారికత్యంత దూరమీ ♦ దారినరయ
దపము జేయుచు కర్మముల్ ♦ దగులనెట్టు
భవ్యమతులకు నిద్ది సం ♦ ప్రాప్తమగుత॥

తరల

చెలియ సీదగు వేదభావము ♦ చెప్పకే గనుపట్టెడిం
బలువియోగ సమ్మేళనాదుల ♦ బారదోలియ ధేచ్ఛగా
మెలగుచుంటివి తాపసాళికి ♦ నేటి ముక్తిలలామవై
చెలియనాదగు శిష్యురాలని ♦ చెప్పుకొన్న యశంబగున్॥

వ॥ అనివారిప్పు రామహానంది పర్వతాగ్రంబునం దొక్కవిజన
స్థలంబునం గూర్చుండియున్నంత నా విపినాంతరంబులం
దాశ్రమవాసులగు తాపసోత్తము లొక్క పుళిందుని చే
వేమనయోగి రాక నెఱింగి మునులెల్ల రా వేమనవద్దకుంజని

చ॥ నరులకు నెట్టి మార్గము య
నంతసుఖంబులు గూర్పజాలునే
వరదుని పాదపద్మములు
బాయక గొల్చిన ముక్తిమార్గ మీ
తెరగు లెఱుంగ జెప్పుము సు
ధీనుతమా యెడ సత్కృపామతిం
గురువుగ నిన్ను గొల్తుము య
కుంఠిత యోగసమాధిపుంగవా

వ॥ అను మునులం గాంచి వేమండాదరాత్తచిత్తుండగుచు మితి లేని లోకవ్యవహారాదు లెఱింగింప నెవ్వారుం దక్షులుగానే రరు గాన నా యెఱింగినకొలంది జెప్పెద నాలకింపుడి

క॥ కపటంబుగ వర్తించెడి
చపలాత్ముల సంగమంబు ♦ సరిలేదని యే
నిపుణాత్మ లెరిగి తమతమ
చపలత్వములుడుగువారె ♦ సద్గుణవశ్యుల్॥

వ॥ దేవునిచే నిర్మింపబడిన సమస్తభూతకోటులయందు మానవుం డుత్తముం డట్టివారిలో శత్రుమిత్రవిచక్షణంబనక సమస్త భూతజాలంబులు తమవంటివనుకొనుచు, శాంతిం బాయక క్రోధ లోభ మాత్సర్య డంబాదులకుం గురికాగ వర్తించు దయామయులగువారలే మహాత్ము లనబడుదురు. వీరు

భార్యా పుత్రమిత్ర ధనాదులయందు నిమిత్తమాత్రవాత్సల్యంబుం జూపుచు నిరర్థక వృత్తులం బాల్కొనక ప్రారబ్ధకర్మాదులకు వెనుదీయక నెట్టి విషయాసక్తులుంగాక గర్మఫలాపేక్షలేని తలంపుతో నాత్మారాముని బ్రేమతో సేవించి యనంతసుఖంబులందెద రట్లుగానివారు

క॥ భూతదయాహీనులరై
పీతభయోన్ముఖులరై య ♦ విద్యాపరులై
నీతినియతి దెలియని చెడు
ఘాతుకవర్తనుల జూచి ♦ కలతంబడెదన్॥

మ॥ వనితాసక్తులు ద్రవ్యకాంక్షులు లిల దం ♦ భాచారచైతన్యులై
జనసామాన్యుల మోసగించి తమ వా♦చాప్రౌఢిచే వారివం
దనముల్ గైకొనిదాచుకున్న ధనముం♦ ధైర్యంబుగాదోచు దు
ర్జనులే ముక్తికి దారిజూపెదరు సం♦సారాబ్ధిలో గ్రుంకుచున్

ఉ॥ ఆసనమేయవచ్చు విపి
నాంతరవీథుల కేగవచ్చు స
న్యాసము బూనవచ్చు జగ
మంతయు లీలగ జూడవచ్చు సం
కాశితయోగదృష్టిని సు
ఖంబుగ దారకమంత్రశక్తిచే
భాసిలునట్టివాడు వెయి
మందికి నొక్కడు నైన జిక్కడే।

క॥ యతివేషంబులు దాల్చుక
మతియుండునో లేదో యన్య ♦ మార్గశ్రీములై
మితిలేనియాతనలచే
పతితులుగా జాలరెల్ల ♦ పాపాత్ములరై॥

క॥ గురువులమని కొందరు తమ
తెరువులు దామెఱుగలేని ♦ధీమసములతో
నెరవాదులాడి పొద్దుం
జరిపెద రిహపరములకు ని ♦ జంబుగ జెడగన్॥

వ॥ మానవుండైనవాడిట్టి యకృత్యంబులం బరిత్యజించి భార్యా పుత్రమిత్రాదులయందు నిమిత్తమాత్రవాత్సల్యుండగుచు నెట్టి ధనవంతునైన దరిద్రునైన సమదృష్టిం భావింపుచు మూఢజనులకు యుచితంబుగా దత్త్వోపదేశంబు జేయుచు యోగవియోగంబులకుం బరితపింపక స్వతంత్రజీవనుండగుచు కల్లకపటాది యల్లరింబోవక నితాంతసంసారాంధకారంబుం దాట నుపాయంబగు జపతప యజ్ఞయాగాదుల నత్యంత నియతిన్నాచరింపుచు నహర్నిశంబులు దేవు నారాధింపు వారే మానవులు శ్రీరామవిభు నారాధింపుటే ముక్తిప్ర దంబనిన

క॥ మునులా వేమన చెప్పిన
విని సంతసమంది యోగి ♦ వేమనకట వం
దనశతము లాచరింపుచు
వనసీమలకేగి రెల్ల ♦ వారలు వేడ్కన్

వ॥ అంత వేమన నాగమణి నచ్చో [illegible] ల్బరించి మహానందిపర్వత
గహనంబున్నిర్గమించె నటపై॥

క॥ వనజాక్ష భక్తవత్సల
ఘన కార్ముఖహస్త దివ్య కౌస్తుభవక్షా
మనసిజహరసన్మానిత
సనకసమునిలోల రామ చంద్రనృపాలా॥

గద్య

ఇది శ్రీజానకీరామచంద్రచరణారవింద వందనకందళితాయమాన
మానసుండును సకలవిద్వజ్జనవిధేయుండునగు శ్రీచిట్టెపు
బుచ్చిరెడ్డిగారి ద్వితీయపుత్రుండును సహజపాండిత్య
వేమారెడ్డినామధేయ ప్రణీతంబైన
వేమన జీవిత చరిత్రంబునందు
చతుర్థాశ్వాసము

# పంచమాశ్వాసము

(శ్రీ) వక్షోజవిలాసిత
భావజహారవినుత శస్త్ర • పాండిత్య సదా
కవిహృదయవర్ణనోదయ
సవినయగుణజాల రామ • చంద్రనృపాలా॥

వ॥ అంత వేమన

క॥ రేనాటభూములకు జని
జానుగ నంద్యాలగ్రామ • సాన్నిధ్యమునం
గానబడెడి పచ్చికబయ
లానందముతోడ గాంచి • యట కేగి వెసన్॥

వ॥ దానిమధ్య నలరారు యొక్క మహత్తరంబయిన వెర్రివాగు నిర్జలంబుగా నున్న దాని మధ్యకుంజని యందొక్క పులిన స్థలంబునం గూర్చుండి

సీ॥ సకలేంద్రియ క్షోభ • సమితి కావంతైన
గలతజెందనిబుద్ధి • బలముతోడ
బలువైన యెండవా • నల కెంతమాత్రంబు
బెదరనియోగ సం • పదలతోడ
గ్రూరజంతువుల సం • చారంబు కిసుమంత
భయ మెఱుంగని భక్తి • నయముతోడ
నాకలిదప్పుల • కావగింజంతైన
సంశయింపని మంత్రి • శక్తితోడ॥

తే॥గీ॥ మనసుదిరుగని యోగసా ♦ మ్రాజ్యుడగుచు
బవలు రాత్రిరి జేయు త ♦ ద్భావమెఱిగి
పవనకుంభిత జఠర ని ♦ బద్ధుడగుచు
వాయుభక్షణచేయు ను ♦ పాయ మెఱిగి॥

గీ॥ అప్పుడా బీటినేలయం ♦ దాలమేపు
భూసురుండొక్కడావాగు ♦ పొంత కఱిగి
తటకునం గాంచి యందున్న ♦ ధన్యతముని
ప్రివిమలానందు డెవ్వరీ ♦ పండితుడని॥

వ॥ భూసురుం డా యోగికి నమస్కరించి యనేకవిధ వాక్యంబుల
బల్కరించిన వేమండేమి ప్రత్యుత్తరం బీయకున్న నిరుత్సా
హుండై పశులందోలుక బ్రాహ్మణుం డరిగె నంత యారవ
నాటియర్ధరాత్రిసమయంబున

సీ॥ కాఱుమబ్బులు మింట ♦ గ్రిమ్మ యద్భుతభేరి
నినదంబులట్లు గ ♦ ర్జనముతోడ
జండభానుని తీవ్రి ♦ మండలంబడగించి
వెడలు విద్యుల్లతా ♦ వితతితోడ
నంతంబులేని దు ♦ రంత వాతాద్భుత
పటలాహతికి భూత ♦ పటలమగల
బ్రిహ్మండభాండంబు ♦ పగిలె నేమన్నట్లు
విరివిగా వర్షంబు గురియుచుండ

గీ॥ మిట్టపల్లంబులెల్ల స ♦ మ్మిళితమగుచు
ధరణి యేకార్ణవంబుగా ♦ దనరుచుండె
వదల కీ రీతి మూనాళ్ళు ♦ వరుసతోడ
గాలి వర్షంబు గురిసె లో ♦ కములు బెదర॥

వ॥ ఇట్టి మహత్తర పెనుగాలివర్షామోఘంబులకు లోకంబెల్ల మారుపడి యనేకావస్థలకుం గురియై తపించుతరి బ్రాహ్మణుండా యోగి కేమాయెనోయంచు

క॥ ఆ యురుములమెఱుపులలో
బాయక దన బీటివాగు ♦ పట్టునదపమున్
జేయు మునీంద్రునిగన్గొన
డాయంజనలేకనక్క ♦ టా యనుచుండెన్॥

ఆ వె॥ అంత మూడునాళ్ళ ♦ కా వెర్రివాగు ప్ర
వాహ మడగె విప్ర ♦ వర్యుడపుడు
మనసు నిలుపలేక ♦ మౌనీంద్రునింజూడ
వచ్చి వెతకెయోగవర్యునపుడు॥

క॥ మునికూర్చుండినతావిది
మనుచేసుక దిబ్బబెట్టె ♦ మౌనియెడ నే
యనుమానంబుతో జేరిన
మనుబయలుంజేయ నందు ♦ మౌని కన్పడెన్॥

వ॥ ఇట్టివింత నా బ్రాహ్మణుండనేకగ్రామంబులకు దెలియంబంపిన యనేకు లనేకతావులనుండి యనేకామడలనుండి వచ్చి

ఆ॥ వె॥ పాలుపంచదార ♦ పాయసాన్నంబులు
వరుసతోడ యోగి ♦ వద్దనుంచి
హారగింపుమన్న ♦ నంటడెయ్యదియైన
పుణ్యయోగసిద్ధి ♦ పూర్ణుడగుచు॥

క॥ పరలోకాసక్తులరగు
గురుమును లీ యోగమంత్రి ♦ గుట్టెరిగికదా
పరమాత్ముని దర్శింతురు
పరగన్ మనతోడ నెట్టి ♦ పనిలేదంచున్॥

వ॥ వేలకొలది జనంబు లా వేమనం డాయుచు బోవుచున్నంత నొక్క ధనికుండొకదినంబున ముప్వుర తరుణప్రాయలగు వేశ్యలంబిలపించి

ఆ॥ వె॥ బీటివాగులోన ♦ బూటకమాడించు
మానివద్దకేగి ♦ సానులార
గానప్రౌఢివల్ల ♦ నేనెఱుంగగజేసి
మరులు గొల్పుడనిన ♦ మగువలేగి।

ఉ॥ చందనకుంకుమాదుల ప ♦ సల్ దులకింపుతో వన్నెచీరలం
బొందుపడంగగట్టి నెఱి♦పొల్పగుసొమ్ములలంకరించుకన్
సుందరులేగి వేమనను ♦ జుట్టుక దాళప్రమాణరఘాంతృతి
న్నందముగా నటించుచు ల♦యంబగు గేయములెన్ని పాడినన్

వ॥ చలింపనియోగిమార్గంబరయ వేశ్యలొక్కుమ్మడి దిగంబరులై వేమనం గౌగలించి ముద్దాడి నిరర్థకప్రయత్నలై చనిన జూచి।

క॥ ధనగర్వంబున బంపిన
ధనికుండపరాధినంచు ♦ దండంబిడి వే
మనయోగి నీ మహత్వము
గన నెంతటివాడ నన్ను ♦ కరుణింపుమనెన్॥

వ॥ అట్టి సమయంబుననే మహానందికొండనుండి యొక్కసన్యాసి వచ్చి యచ్చోటంగల ప్రజలెల్లరకు వేమనవృత్తాంతంబెల్ల నెఱింగించుటయు, నాటియర్ధరాత్రంబున వేమం డా తావు బాసి

క॥ శ్రీశైల మల్లికార్జును
వాసంబున కేగి యచట ♦ వారత్రయముల్
శ్రీశైలేశునిగొల్చిన
బాశుపతాస్త్రిండు వేడ్క ♦ బ్రత్యక్షుండై॥

క॥ తియ్యవిలుకానివైరుడు
దయ్యాల కుటీరవాసు ♦ దయగల యీశుం
డొయ్యన మునికులకుంజరు
నయ్యాయని పిలచిభూరి ♦ యాదరణముతోన్॥

మ॥ భవదీయోగ్రతపః ఫలంబునగ సం ♦ ప్రాప్తుండనైనాడనే
భవదీయాద్భుతదృష్టికిన్నెదుట నీ♦ పాపౌఘముల్ బాసె సం
భవదుఃఖాదివిశేషము ల్బొరయ సం ♦ బంధంబు లేదింక నీ
భవబంధం బెడమాయె నాహితపు సద్భక్తాగ్రణీచెప్పెదన్॥

మ॥ ననుసేవింపుచు నాకథల్ వినుచు నా ♦ నాదేశసంచారివై।
మనుమిచ్చోటనె కొన్ని వర్షములుసా♦మాన్యాదులౌవారుదు
ర్జనులౌవారలు నిన్ను గాంచితమదు ♦ స్సంచారముల్బాసి స
జ్జనులై నాయెడ గొందరైన మదివా♦త్సల్యంబులంజూపెడిన్॥

వ॥ మానవలోకంబందిట్టి యమోఘతపంబుచే నన్నారాధించిన వా రెవ్వరుం గాన్పింప రటయునుగాక పిపీలికాది బ్రహ్మ పర్యంతంబు వరకు సమబుద్ధిం జూపిన దయాపరుండవగుటచే నేనేనీవు నీవేనేనని యాశీర్వదించిన సర్వేశునకుం బ్రణమిల్లి వేమన॥

సీ॥ శ్రీకంఠమల్లేశ ♦ శివ విశ్వలోలాయ
పరమేశపురహర ♦ గిరినివాస
చంద్రమౌళికలాప ♦ శాశ్వతానంతాయ
భవరూపహరణ మా♦ధవహితుండ
ప్రణవశబ్దాకార ♦ పార్వతీపతియోగ
నియతి సంపూర్ణహా ♦ నీంద్రవేష
నాగభూషణరుద్ర ♦ నవ్యయాశ్రితపోష
గంగాధరాపూజ్య ♦ లింగరూప

గీ॥ నమ్మికొని నిన్నె నాదగు ♦ నెమ్మనమున
యాశ్రయించితినయ్య ని ♦ న్ననుదినంబు
దూరమైపోయె భవబంధ ♦ భారమిపుడు
ధన్యతముడైతి నీదు సం ♦ దర్శనమున।

వ॥ అని తలంపున నింపిన పినాకపాణికడుంగడు సంతోషుండ
గుచు వెంటనే వేమనయోగి నాశీర్వదించి భక్తుననుమతిం
గొని ఫాలాక్షుం డదృశ్యుండైన

క॥ అంతట వేమండా వన
ప్రాంతంబుగ బోవుచుండ ♦ పడతియొకర్తుక్
వింతగ బెబ్బులిపట్టుక
గంతులుగొనిపోవుదాని ♦ గన్గొని పల్కెన్॥

ఉ॥ పాపముగాదె నీకు పసి ♦ పాపలతల్లిని నోటబట్టుకన్
కోపముతోడ బోయెదవు ♦ కోరలుబెట్టిన దిందుకేన నీ
పాపలవంటి పాపలకు ♦ బాలియ నెవ్వరు తల్లులింక నీ
కోపము నాపుకొమ్ము పసి ♦ కూనలతల్లిని దింపిపొమ్మనన్॥

వ॥ అనునెడ ప్రక్కత్రోవంగొనిపోవు పులిండాయన్నతికి

గీ॥ కోపమున యోగబెత్తంబు ♦ గొనిబిరాన
బులికి గిలికాడనని రెండు ♦ పోట్లు బొడున
గిలికె నేనోప లేనని ♦ పులిబిరాన
బోయకాంతను విడిచి తా ♦ బోయెగుహకు॥

వ॥ అంత శబరాంగనకాపులికోరలచేనైన గాయంబులదనమంత్ర
ప్రభావంబుచేమాన్పిన యువతీమణి వేమనంగాంచి.

ఉ॥ వాలుమెకంబునోటబడి ♦ వంతలగుందుచునాదుబిడ్డ కుం
బాలెవరిత్తురంచు బహు ♦ భంగుల కేకలువేయుచుంటినా
కాలసమాప్తియయ్యెనను ♦ గావగ నెవ్వరు దిక్కటంచు నా
మేలుదలంచి బెబ్బులికి ♦ మిండడవైతివి యోగిపుంగవా॥

క॥ అని వేమనపదములపై
వనితామణిమ్రొక్కి లేచి ♦ వహ్వారెయిపుడో
మునికుంజర నీకృపచే
మనితిన్ నీమేలునింక ♦ మరుననటంచున్॥

వ॥ అనివేమనసెలవుంగొని చనివనవాసులెల్లరకీ విశేషంబెఱిగించినవారెల్లను.

ఆ॥ వె॥ పోయిచూతమట్టి ♦ పుణ్యునిదర్శన
మెల్ల పాపహరణ ♦ మేనటంచు
పండ్లుదేనియలను ♦ బట్టుక జనివారు
కాననమునయోగి ♦ కానరాక॥

వ॥ నిర్భాగ్యులమగు మనబోంట్లకట్టి మహాత్ములదర్శనంబబ్బుట దుర్లభంబనునిరాసలచే వారివారి కుటీరంబులకుంబోయిరంత

క॥ తిన్నగ శ్రీశైలాటవి
కొన్నాళ్లకుగడచి చేరు ♦ కొనియె నృసింహుం
డున్నయహోబిలముంగని
పున్నెంబిచ్చోట నుండ ♦ బోలునటుంచున్॥

వ॥ అహోబిలంబునంగల నరసింహాలయంబునంబ్రవేశించి.

సీ॥ కంజాతదళనేత్ర ♦ కమనీయ శుభగాత్ర
భక్తవత్సల దీన ♦ బాంధవాయ
కాలకంధరచాప ♦ ఖండితాగమరూప
కౌస్తుభవక్షలో కస్తుతాయ

కాలాహితల్ప సం ♦ కల్పితానంతాయ
కోదండరామ స ♦ ద్గుణసకామ
గజరాజవరద భా ♦ స్కరకోటిసంకాశ
దానవాంతకయోగి ♦ మానసాబ్జ

గీ॥ సాధురక్షణ దుర్జన ♦ సమితిహరణ
అమల ధర్మార్థకామ లో ♦ కాభిరామ
పారమార్థికశీల నా ♦ పాలివరద
వందనంబయ్యమునిజన ♦ వందితాయ।

వ॥ అనియభ్యర్థించిన ప్రహ్లాదవరదుండా వేమనయందత్యంత ప్రేమాస్పదుండై.

క॥ తనవిశ్వరూపమప్పుడు
ఘనముగ జూపింపజూచి ♦ గాబరబడి వే
మననారసింహునింగని
వినుతింపదొడంగె దేవు ♦ బిఱుదులనెల్లన్.

సీ॥ మకరిచే జిక్కి సా ♦ మజము సుక్కినినాడు
కరినిగాచినమేటి ♦ దొరవు నీవు
తండ్రిబాధలకు చి ♦ త్తంబునచ్చిననాటి
ప్రహ్లాదునేలిన ♦ ప్రభుడవీవు
కొల్వులో పాంచాలి ♦ కోకలూడ్చెడివేళ
వలువలిచ్చిన దయా ♦ పరుడవీవు
ద్రోణిబాణజ్వాల ♦ దాకి భూస్థలిబడ్డ
వాని బ్రతికించిన ♦ వాడవీవు

ఆ॥ వె॥ నీ సహాయమున్న ♦ నిజమైన భక్తుల
కెందునైన లోటు ♦ జెందగలద
నిన్ను మరచి తిరుగు ♦ దున్నపోతులకెల్ల
కష్టవితతు లెపుడు గ్రిమ్ముచుండు॥

వ॥ దేవా మానవమాత్రుండనగు నాకిట్టి భవదీయ విశ్వరూప సందర్శనంబుగల్గుట కింతకు బూర్వ మెట్టి సత్పుణ్యాచరుణుండనోగదా నేటికి ధన్యుండనైతినని వందనశతం బర్పించిన విశ్వరూపుం డా వేమన కట్లనియె

ఉ॥ చేసిరి యెందరోమునులు ♦ సిద్ధులు సాధ్యులు బన్నగాళి స
న్యాసులు రాజయోగబుధ•స త్తములార్యులునన్ను గూర్చి సం
భాసిత యజ్ఞయాగములు ♦ భవ్యతపవ్రతశీలవంతులై
చేసినదాని సత్ఫలము ♦ జెందగ జాలిరె మోసకారులై

క॥ వనితాజనవాంఛకులై
ననుడంబంబునకు గొల్చు ♦ నరుల కుయుక్తుల్
వినిమెచ్చకుందు నెప్పుడు
నినుమించిన యోగి లేడు ♦ నిజముగ వేమా॥

సీ॥ భార్యపుత్రులగోల ♦ బడలేక నెందరో
దేహసన్యాసులై ♦ తిరుగువారు
దిండి వేళకు లేక ♦ బండమంచము లేక
బైరాగివృత్తిలో ♦ బరగువారు
బరులయప్పులు దీర్ప ♦ బడలేని దొంగలై
కపటమునీంద్రులై ♦ కదలువార

లన్యవిత్తంబులం ♦ దాసక్తిపరులునై
గురువుల నెపముల్తో ♦ దిరుగువారు।

గీ॥ పాపపుణ్యంబు లెఱుగని ♦ పాడునరులు
నన్ను సేవింపలేరు వా ♦ రెన్నటికిని
భవ్యగుణజాల నీవంటి ♦ భక్తవరులు
కోటికొక్కండుగాక పె ♦ క్కురులు గలర॥

వ॥ సర్వసంగపరిత్యాగివగు నీకు నేజూపట్టుట వింతయేమున్న దిటపై ద్వాదశవర్షంబు లీధరాతలంబునం జరియింపుమటపై నాలోక ప్రాప్తిం జెందెదవని యాశీర్వదించి నారాయణుం డదృశ్యుండైన వేమండాయహోబిలంబుం గడచి పశ్చిమోన్ముఖుండై చని ముందొక్క విశాలంబగు పచ్చికబయళ్ళ మధ్యంగల కాళీ నిలయంబుం జేరుక

సీ॥ కాళిదాసాది స ♦ త్కవుల మ్రొక్కులుగొన్న
భానుమంతినివి సౌ ♦ భాగ్యవతివి
మంత్రిగాండ్రలకు సం ♦ బంధరూపిణివమ్మ
యహిభూషణుని పట్ట ♦ మహిషివమ్మ
ముముక్షుమూర్తుల కాది ♦ మూలమై వేదాంత
మార్గదర్శనివి స ♦ మాధియోగ
నియతి కాధారస ♦ న్నిహితరూపిణివమ్మ
ముక్తికాంతవు లోక ♦ శక్తివీవె

గీ॥ దేవి నేనొక్క సన్న్యాసి ♦ దేశికుండ
దారిదెలియని యోగ సం ♦ ధానపరుడ

మందభాగ్యుండ ముక్తి సం ♦ బంధబలుప
ననెడి వేమనభక్తికిం ♦ దనరి కాళి॥

వ॥ వెంటనే భక్తలోకగ్రామణియగు వేమనకుం బ్రసన్నురాలై మహామంత్రప్రభావంబు తెఱుంగఁజెప్పితి రోహితంబయిన వేమం డా దేవినిలయంబునం దలరారుచుండ సమీపభూము లం బచ్చికలంగొను పశుమండలం దొక్క యావు యెద వివేకించి

సీ॥ పోతెద్దులావుకై ♦ పోట్లాడుకొనుచుండ
దాపులో నున్నట్టి ♦ కాపువాండ్రు
బరుగుమేరగనున్న ♦ బనివాండ్రెల్లను
గలుపుగాదముదీయు ♦ గరితలెల్ల
బేరెముల్ గొనివచ్చి ♦ దూరంబుగా నిల్చి
కొదమ పోతెద్దులా ♦ మొదవుకొరకు
భానుచంద్రప్రభా ♦ భాసమానంబైన
కన్నుల చాయనై ♦ కల్యమగుచు

ఆ॥ వె॥ భూమి దద్దరిల్ల ♦ బుచ్చలపైఁగోలు
నూడి రక్తజాలు ♦ యూడికలను
చూపరులకు భీతి ♦ చూపట్టుమన్నను
యీసునుడిగి ప్రాణ ♦ మాసగొనవు॥

క॥ వెనుదీయ వెంతమాత్రము
కనుతెఱ్ఱగ జేసి రక్త ♦ కణములు దొరగన్
దినమర్ధమైన దెబ్బగవు
యనురాగమదాతిశయము ♦ లగ్గలమగుచున్॥

క॥ బుసలేయుచు టెలుగ వెప్పుడు
పసిబాలకు లడ్డమైన • పక్కకుదొలగుచ్
కసిబూన వెన్న డీకిరియ
బసవన్నలు బ్రతుక వింక • బాపురె యంచున్॥

క॥ నోరెఱుగని పశువులె యీ
తీరుగ బోరాడుచుండె • దెలిసిన మనుజుల్
కారాడుటొక్క వింతయె
శ్రీరామా మోహమెంత • చెడ్డది సుమ్మా॥

వ॥ అనుతలంపుతో వందలాది జనంబు లనేక విధంబులం జుట్టుముట్టి కట్టెలం గర్రలం గొట్టుచు రాలరప్పలంగొని రువ్వియాబోతుల పోరు మాన్పింపలేనితనంబుతో నున్నంత

క। కాళీనిలయము వెలువడి
ఫాలాక్షునిబోలె యోగి • పరుగునజని యా
భీలాకృతి బోరాడెడి
కాలగళుని వాహనముల • గనుగొని వేడ్కన్॥

క॥ విడిబడి కాటుకకొండల
వడువున బెనగాడు వృషభ • వర్యులగని తా
బిడుగువలెన్ శబ్దించుచు
కడిమిం గొమ్ములను చేత • గదిమిపట్టుకన్॥

వ॥ విడదీయు సమయంబున వేమన మొలకుంగల గోచిపాతధరాస్తలింబడినదాని నెఱుంగనితలంపుతో దిగంబరాకారుండై

యాబోతుల పోరు మాన్పి యచ్చోటంగల యరణ్యనీటి వాగునకుం దోల్కొనిపోయి వృషభరాజంబుల దేహంబుల గడిగి వాటి కర్ణపుటంబుల మహామంత్రోపదేశంబుగావించి పోవ నియోగించిన

ఆ॥ వె॥ అన్నదమ్ములట్టు ♦ లాబోతులప్పుడు
కలసిమెలసియాల ♦ కదుపులందు
దిరుగుచుండె యోగి ♦ దెల్పినదియ్యదే
మరువరానియోగి మా ♦ర్గమరసి॥

వ॥ అట్టియెడ నచ్చోటంగల జనులెల్ల రా వేమనయోగి ప్రభావంబున కాశ్చర్యంబందుచు.

క॥ పుచ్చలపై నింతింతటి
పెచ్చులులేనంగబోరు ♦ పెనువృషభములన్
జెచ్చెర విడబడగొట్టెను
అచ్చగనీ యోగిమనుజు ♦ డన మనవశమా॥

వ॥ అంచునా ప్రజలెల్లరా వేమనపదపద్మంబులకున్నెఱంగి.

క॥ గురుబలుడ వరయకలియుగ
గురుడవు నీకంటెనొండు ♦ గురుతలిదండ్రుల్
బరమార్థ మెఱుగదెల్పెడి
పరులెవ్వరు లేరుముక్తి ♦ భావమెఱుంగన్॥

వ॥ మహాత్మా నీవునుమావలె పూర్ణసాకారుండవై సిగ్గు భయ దుఃఖాదులవర్జించి సంసారాంధకారంబును గడచి దైవసమా

నుండవై సంచరించు మహత్తరతత్త్వోపదేశంబు మాకుం బోధించి కృతార్థులంజేయుమనవృను దరస్మితవదనుండగుచు.

సీ॥ సంసారతామిస్ర ♦ సముదాయమెడ బాయు
మార్గమెఱుంగ సా ♦ మాన్యమగునె
యలవిగా కెందరో ♦ యడవులపాలైరి
దారసుతాది వి ♦ త్తములవదలి
యాశ్రమాంతరవాసు ♦ లై యెందరో తొల్లి
యాకలిదప్పుల ♦ నాగబట్టి
బలునైన యెండవా ♦ నలకోర్చి పవనుని
యోగబలంబుచే ♦ లాగిపిదప

గీ॥ డాసి తొమ్మిదికంతలఁ ♦ మూసి నాళ
కోశములనుండి రేచక ♦ కుంభకముల
దాటిపరిపూర్ణ వెన్నెల ♦ కూటమందు
యెుకమరుపును లేక నెం ♦ దరుగకుండు॥

వ॥ ఇట్టినిశ్చలానందులైన మహామహులు.

క॥ దేహంబస్థిరమని తమ
మోహంబెడ బాపిసిద్ధ ♦ మునివర్తనులై
గేహము వెలువడి జపతప
సాహసములముక్తినంద ♦ జాలుదురనఘుల్॥

వ॥ కావున సంసారాశ్రమవాసులైన మహాత్ములు దారాపుత్ర మిత్ర వాత్సల్యంబులందగుల్కొని కామక్రోధ లోభాది గుణంబులకుంగుఱియై పారమార్థిక మెఱుంగక భూతజాలం

బుల కెగ్గుగావింపుచు దన్నుదానె యెఱుగని యవిద్యాపారీణులై యనేకజాడ్యంబులచే పీడింపబడి యవసానకాలంబున యమకింకరులబారింబడి కఠినశిక్షలననుభవింతు రట్టివారెల్లప్పు డెడ తెగని జననమరణాద్యవస్థలం బొందుచుందురు వీరియందే కొందరు డాంబికవర్తనులై

క॥ గురువులమని కొందరు తమ
తెరువులు దా మెఱుగలేని ♦ ధీమసములతో
బరువులుజెడ సంపాదన
పరులై నరకంబునందు ♦ బడుచుందు రివెస॥

వ॥ అట్టి విషయవాంఛాసక్తులగు దొంగగురువులనాశ్రయించిన వారుసహితంబు నిహపరంబులకుంజెడి యధోగతింజెందుచుందురు.

క॥ సంసారబంధముండెగ
కంసారిస్మరణ గాక ♦ గలదేవిధముల్
హింసదొరగి మీరెల్లరు
గంసారింగొలువుడన్న ♦ గలుగుసుఖంబుల్।

క॥ ఇదియే పరమరహస్యము
మదికుదిరినవారికెల్ల ♦ మదమునవేయే
పదుములుబల్కెడి కుక్కల
చదువులుమీకేల పొందు ♦ సాగియిండ్లకుల్

వ॥ అంతవేమండచ్చోటుంబాసి యనేకజనపదారణ్యాదుర్గమస్థలంబులం దేకాకియై చరింపుచు కడపజిల్లాలోని కటారుపల్లె కుంజేరుకొని.

క॥ మందారవికసితోత్పల
కుందకుటజనారికేళ ♦ కోవిదారమా
కందశిరీషాదులచే
నందగిలెడివనము జేరి యందొకచోటన్॥

వ॥ మాలతీగురువెంద మందారమల్లికాలతాదులల్లిబిల్లిగా నల్లుకొనిన యొక్కనికుంజాంతంబునం జేరి కూర్చుండివనవిహంగంబుల కోలాహలంబు లాలకింపుతతటి

సీ॥ కోవెలల్ గళమెత్తి ♦ కూతలేయగసాగె
బంచమస్వరము మా ♦ పలుకులెయని
కేకులు మెలుగెత్తి ♦ కేకలేయగసాగె
షడ్జమస్వరము మా ♦ శబ్దమెయని
రామచిల్కలుమూల్గి ♦ రద్దిగొల్పగసాగె
మొనయుమాసేరు స ♦ న్మొక్తియె యని
గోరువంకలు గేయ ♦ గోష్ఠిసల్పగసాగె
మరుని శాస్త్రములు మా ♦ మాటలెయని

తే॥ గీ॥ పావురములంత సొంపుగ ♦ బలుకసాగె
రతికి సొంపైనకీవి మా ♦ రంతులెయని
పలుకు పక్షికులంబుల ♦ భావమెఱిగి
సంతసింపుచు వేమ డా ♦ వింతలుడిగి॥

వ॥ యోగనిద్రాపరవశుండైయున్న యోగివద్ద కాతోటమాలి కుటుంబినియగు పద్మావతి యేతెంచి

క॥ పరముక్తికాంత గమ్య
స్ఫురణం బనరారు యోగ ♦ పురుషుని పద పం
కరుహములకెఱఁగి మునికుం
జర ననుగృపజూడుమన్న ♦ సంయమిదానన్॥

వ॥ పలుకకున్నంత పద్మావతి కటాకుపల్లెకుంబోయి ప్రజల కాయోగియున్నతావెఱింగించిన తత్పురవాసులాబాలగోపాలంబుగావచ్చి యిమ్మహాత్ముండు వేమనయోగి యని యెఱింగినవారలై

సీ॥ పాలుచక్కెరతేనె ♦ ఫలరసంబులుదెచ్చి
యోగిముందరబెట్టి ♦ సాగువారు
పొందుగా సంసార ♦ బంధమూడగదన్న
సదుపాయ మడుగంగ ♦ సాగువారు
మితిలేని రోగ సం ♦ తతులనోపగలేక
మునిచుట్టు బవళించి ♦ మొక్కువారు
పెక్కు దారిద్ర్యులై ♦ దిక్కులేకాయోగి
పదపద్మముల వెంట ♦ బరగువారు

ఆ॥ వె॥ గ్రుడ్డికుంటివాండ్రు ♦ బిడ్డలు లేనట్టి
వారలెల్ల యోగి ♦ వద్దకు జని
ప్రస్తుతింపుచుండ ♦ బదిదినంబులువెళ్ళె
నంతయోగియోగ ♦ మంతపరచి।

వ॥ తనచుట్టుంగల సామాన్య మానవఘోషంబాలకించి దిగ్గున నిలువంబడి వారినెల్లరగూర్చుండ నియమించి వారలకిట్లని చెప్పదొడంగె

క॥ మీమీ వాంఛితముల నిడ
స్వామిదయామయుడు దక్క ♦ సకలావనియం
దేమానవుడీయంగల
డీమాటకు నంతరాయ ♦ మెందుంగలదా॥

క॥ దుర్భరభవజలధిని యా
విర్భూతులమగుచు గర్మ ♦ విడునకయెన్నో
గర్భములదూరి కడపట
నిర్భిన్నంబగుచు బుట్టి ♦ నీల్గుదు రెపుడున్॥

వ॥ మానవలోకంబున కవశ్యంబు లెఱింగించెద సత్యసంభాషణంబును నహింసాచరణంబును పారమార్థికంబును నిమ్మహాపరివర్తనత్రియాదులయం దిచ్ఛకొని యహంకారాది గుణశూన్యుండునై విధికృతంబులం జేయునట్టి మహాత్ములు నిరాతంక సుఖోల్లాసులగుచు నెట్టి కష్టంబులకుం గురిగాక యవసానకాలంబున పునర్జన్మరాహిత్యంబును, శాశ్వతానంద సంధాయికంబగు పుణ్యలోకప్రాప్తిం జెందెదరుగాక. యిట్టి యుత్తమాచరణంబున కవ్వలివారలై వేదవేదాంగ పురాణేతిహాసంబులెన్ని చదివినను, జటలు రుద్రాక్షకాపీనాదులం ధరియించి కాశీ గయా ప్రయాగముల కేగి యాయాచోట్లం

గల పుణ్యనదీనదంబులయందు గ్నానమాచరించినను యజ్ఞములు చేయు చున్నను దీక్షితులు శాస్త్రులుసోమయాజులనెడి యసార్థకనామ డాంబికులరై వర్తించినను దేహదౌర్హిష్ఠ్యముచే జననమర ణాద్యవస్థలం బొందుచు సత్యలోకప్రాప్తి కెడమగుచు సమ వర్తి దూతలబారింబడి యట్టివారిచే నగు తర్జనదండనాదుల కోహటింపుచు నెడతెగని పునర్జన్మ మరణాద్యవస్థలం జెందు చుందురు

సీ। కావున మీరట్టి ♦ కర్మంబు లెడబాయు
మార్గంబు జెప్పెద ♦ మానకిపుడె
మర్మంబు లే దొక్క ♦ మాటతో ముగియింతు
శ్రీరమేశుని పేరు ♦ జిహ్వాగ్రమున
బ్రస్తుతింపుచునున్న ♦ భవబంధ దోషము
లంతులేకెప్పుడో ♦ యంతమించు
నింతకంటెను కర్మ ♦ మొడలింప నింకొక
మంత్రమున్నదనుట ♦ తాంత్రికంబె

ఆ॥ వే। కానమీరు పూర్వ ♦ కర్మకు లోనయి
పంకజాక్షు దివ్య ♦ పాదయుగళి
చిత్తకమలమందు ♦ జేర్చితరింపుడీ
ముందుబాధలేవి ♦ జెందకుండ।

వ। మెండియు సమస్తాశ్రమంబులలో గృహస్థంబే శ్రేష్ఠంబగును గాన మీరట్టి యుత్తమాశ్రమవాసులరై యాయురారోగ్య

ప్రాప్తులగుచు నిత్యానందసంధాయియగు గోవిందు నారాధించి శాశ్వతకీర్తిసంపన్నులగ దురుగాక యని వారలం బోవనంపి, శార్వరినామసంవత్సర చైత్రశుద్ధనవమి సాయం సంధ్య వేళయందు

సీ॥ ఆసన్న మరణార్థి ♦ యగుచు వేమండప్పు
డారుమూడింటిని ♦ బారదన్ని
వాలుగా మూడారు ♦ వాకిళ్ళు బంధించి
ప్రణవ నినాద ♦ వైభవముతోడ
కుప్పించి ప్రాణంబు ♦ కుంభకంబుకు జేర్చి
కూటస్థలంబున ♦ నాటద్రొక్క
పంచవన్నెలకోటి ♦ భాస్కర తేజమై
తనదు సహస్రార ♦ మునకు జేరి॥

ఆ॥వె॥ ముక్తికాంత మెడకు ♦ పుస్తెనుగీలించి
బ్రహ్మరంధ్రమంత ♦ బగులజించి
వేమడేగెనపుడు ♦ విష్ణులోకంబుకు
బవలు చైత్రశుద్ధ ♦ నవమినాడు।

వ॥ అంత కటారుపల్లెలోని ప్రజ లాబాలగోపాలంబుగావచ్చి పునుగు చందన కర్పూరకర్దమపుష్పమాలికలచే వేమన యోగి దేహమలంకరించి నానావిధ వాద్యఘోషంబులతో ననేక గ్రామంబులనుండివచ్చిన నానావిధభక్తసందోహభజనలతో మహాత్ముండగు వేమనయోగిని (కడపజిల్లా) కటారుపల్లె యందు సమాధింగావించిరనిన

క॥ వనజాక్ష భక్తవత్సల
ఘన కార్ముకహస్త దివ్య ♦ కౌస్తుభవక్షా
మనసిజహర సన్మానిత
సనకసమునిలోల రామ ♦ చంద్రనృపాలా॥

గద్య

ఇది శ్రీజానకీరామచంద్రచరణారవింద వందనకందళితాయమాన
మానసుండును సకలవిద్వజ్జనవిధేయుండునగు శ్రీచిట్టెపు
బుచ్చిరెడ్డిగారి ద్వితీయపుత్రుండును సహజపాండిత్య
వేమారెడ్డినామధేయ ప్రణీతంబైన
వేమన జీవిత చరిత్రంబునందు
పంచమాశ్వాసము
సంపూర్ణము





గుంటూరు అమీర్ముద్రణాలయమునందు
ముద్రింపబడియె.

# కవికి విరాళంబులంపిన శ్రీమంతులు



| | |
|---|---|
| మహాశ్రీ మండాళ సుబ్బారెడ్డిగారు, నుదురుపాడు | రు. 116 |
| గుదిబండ్ల నరసిరెడ్డిగారు, జొన్నలగడ్డ | 50 |
| కొల్లి వెంకటరెడ్డిగారు, పరసతాళ్ళూరు | 50 |
| వద్దుల నరసిరెడ్డిగారు, పెదమక్కెన | 30 |
| వద్దుల చినకొండారెడ్డిగారు, పెదమక్కెన | 25 |
| అల్లం పానకాల్ రెడ్డిగారు, వి. యం., గుడిపూడి | 25 |
| తాళ్ళ వీరారెడ్డిగారు, రావెల | 30 |
| తాళ్ళ శేషిరెడ్డిగారు, రావెల | 25 |
| భవనం కోటిరెడ్డిగారు, సుబ్బారెడ్డిపాలెం | 25 |
| పడాల రామమూర్తిరెడ్డిగారు, రొంపిచర్ల | 25 |
| సందిరెడ్డి చినవెంకటరెడ్డిగారు, కట్టావారిపాలెం | 25 |
| అవుతు కోటిరెడ్డిగారు, చినపరిమి అగ్రహారం | 25 |
| గణపా రామస్వామిరెడ్డిగారు, మునుగోడు | 25 |

# కావ్యపోషకులు

సత్తెనపల్లి తాలూకాలోని గ్రామములవారు

పెదమక్కేన

వద్దుల చినహనిమిరెడ్డి

వద్దుల వీరారెడ్డి

శ్యామల వీరారెడ్డి

వద్దుల రాఘురెడ్డి

ఘంటా గోవిందురెడ్డి

ఘంటా కోటిరెడ్డి

తెనాలి కొండారెడ్డి

కొండారెడ్డి

రామిరెడ్డి

వెంకటప్పారెడ్డి

గుంటూరుతాలూకా రావెల

మారెళ్ళ గోపాల్ రెడ్డి

విప్పల వెంకటకృష్ణారెడ్డి

తాళ్ళ వెంకటరెడ్డి

భీమిరెడ్డి శేషిరెడ్డి

డాక్టర్ కోటిరెడ్డి

తాళ్ళ నాగిరెడ్డి

ఝూమని మల్లికార్జునరెడ్డి

శ్యామల వీరారెడ్డి

ఆళ్ళలక్ష్మారెడ్డి

శ్యామల రాఘవరెడ్డి

కుందురువారిపాలెం

కుందురు వేమారెడ్డి

అలవాల పుల్లారెడ్డి

చయికం వెంకటప్పారెడ్డి

కొప్పుల మస్తాన్‌రెడ్డి

యేరువ గోశిరెడ్డి

రావెల

రావెల శ్రీహరిరావు

భీమిరెడ్డి పెదకోటిరెడ్డి

తాళ్ళ పెదకోటిరెడ్డి

దాట్లకోటిరెడ్డి

బోళ్ళ వెంకట్రామిరెడ్డి

రావెల సీతారామయ్య

వీరారెడ్డి

సంగయ్య

దండా వెంకటసుబ్బారెడ్డి

పొన్నెకల్లు

చలిమడుగు హనిమిరెడ్డి

దొంతిరెడ్డి రామిరెడ్డి

పప్పుల గోపిరెడ్డి

చలిమడుగు లింగారెడ్డి

యర్రంవారిపాలెం

యర్రంకోటిరెడ్డి

యీూ హనిమిరెడ్డి

బక్కిరెడ్డి

రుద్రారెడ్డి



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA118B113 |
| పుస్తకం పేరు | వేమన జీవిత చరిత్రము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 105 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | nil |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |